# ఆంధ్రపత్రిక

317612




The Andhra Patrika, Madras. } Regd. No M. 1118 Vol. 36 No. 253 FRIDAY 16th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao


# ఆంధ్రరాష్ట్ర ఆర్థికస్థితి : పూర్తి వివరాలు తెలుపమని కేంద్రప్రభుత్వాదేశం

## కాంగ్రెస్‌లో సభ్యులను చేర్చడానికి ఇంకా 15 రోజులు గడువు

### రాష్ట్రపతి డా॥ పట్టాభి ప్రకటన

న్యూఢిల్లీ, డిసెంబరు 14 : సాధారణ కాంగ్రెస్ సభ్యులను, వోటుచేయు అధికారముగల కాంగ్రెస్ సభ్యులను చేర్పు గడువు 15 రోజులు పొడిగింపబడినది. జనవరి 26 తేదీ భారత రిపబ్లిక్ అవతరణోత్సవ దినముగుటచేతను, జనవరి 30 తేదీ గాంధి మహాత్ముని సాంవత్సరిక మగుటచేతను గడువు పెంచబడినదని చెప్పుచు కాంగ్రెస్ మహాసభాధ్యక్షులగు డా॥ పట్టాభి సీతారామయ్యగారు ఈ క్రిందిప్రకటన గావించుచున్నారు: "సాధారణ కాంగ్రెస్ సభ్యులను చేర్పు గడువును ఒక నెలపెంచి వోటు చేయు అధికారముగల కాంగ్రెస్ సభ్యులను చేర్పు గడువుతో సమానము చేయవలెనని పలువురు కోరియున్నారు. ఇందువల్ల ప్రస్తుత ఎన్నికల కార్యక్రమము తారుమారు కాదని, 1950 సం॥ జనవరి 15 తేదీవరకు యిచ్చిన గడువు మారదని వారు తెలిపియున్నారు. ఇది సరికాదు. ఎందువల్లననగా సాధారణసభ్యులను చేర్పుట కిచ్చు గడువుకును వోటు చేయదగిన సభ్యులను చేర్పుట కిచ్చుగడువుకును ఒక నెలరోజులు వార యుంచవలెనని మేము బుద్ధిపూర్వకముగానే నిర్ణయించియుంటిమి. ఈనెల రోజులలో గ్రామ పంచాయతీల ఎన్నికలు జరుగునని అటు తరువాత ఎన్నికలైన పంచాయతీదార్లతోను, వోటుచేయదగిన కాంగ్రెసుసభ్యులతోను కూడిన వోటర్ల పట్టికలు సాధ్యమైనంత త్వరలో పూర్తియగునని, ఇవి పూర్తియైన రెండల జిల్లా ఎన్నికలను, రాష్ట్రీయ ఎన్నికలను జరుపవచ్చునను ఉద్దేశ్యముతో మేమీ నిర్ణయముగావించియుంటిమి.

ఐనప్పటికి అనేకులు విజ్ఞప్తులు గావించుటవల్లను, ఇంతకంటె ముఖ్యమైనది జనవరి 26 తేదీ భారత రిపబ్లిక్ అవతరణోత్సవము, జనవరి 30 తేదీ గాంధి మహాత్ముని సాంవత్సరికము అగుటచేతను ఈ రెండు రకములైన సభ్యులను చేర్పుగడువులు 15 రోజులు పొడిగింపబడుచున్నవి. సాధారణసభ్యులను చేర్పుట ఈ నెలాఖరులోగా పూర్తికావలెను. వోటు చేయతగిన సభ్యులను చేర్పుట 1950 సం॥ జనవరి 15 తేదీలోపుగా పూర్తికావలెను. పంచాయతీదార్ల ఎన్నికలు సావకాశముగా, అనగా ఫిబ్రవరి ఆఖరులోపుగా జరుగుటకు యిందువల్ల అవకాశ ముండును."

### ఖాన్ సోదరుల అగచాట్లు
### పార్లమెంటులో ప్రశ్న: నెహ్రూ సమాధానం

న్యూఢిల్లీ, డిసెంబరు 14 : నేడు పార్లమెంటులో ముకుట బిహారీలాలు భార్గవా, పాకిస్తాను ప్రభుత్వం జైలులో ఖాన్ సోదరులకు కలిగిస్తున్న హింసనుగురించి పత్రికలలో వెలువడినవార్తలూ, దేశమంతటా జరిగే నిరసనసభలూ ప్రభుత్వంవారు గుర్తిస్తున్నారా అనీ, ఈవిషయంలో ఇండియా ప్రభుత్వంవారు జోక్యం కలిగించుకొని ఐక్యరాజ్యసమితికి నివేదిస్తారా అనీ ప్రధానిని అడుగగా నెహ్రూ సమాధానం చెబుతూ, ఇతరదేశాల అంతరంగిక వ్యవహారాలలో ఇండియాప్రభుత్వం జోక్యం కలిగించుకోదనీ, అయినప్పటికీ ఖాన్ సోదరులను గురించిన వార్తలు ప్రభుత్వంలోని వ్యక్తులకు ఖేదం కలిగిస్తున్నవనీ, వారు ఈదేశంయొక్క స్వాతంత్ర్య సమరంలో అద్వితీయమైన పాత్ర నిర్వహించారనీ, వారికి ఉచితమైన ఆదరం చూపబడాలనీ అన్నారు.

## రాష్ట్రప్రభుత్వానికి చేరిన లేఖపై ప్రధాని కుమారస్వామిరాజా వివరణ

### సరిహద్దు నిరూపణకు ముగ్గురు సభ్యుల సంఘంగాక ఒకే కమీషనర్ ఉండాలని సూచన

చెన్నపట్నం, డిసెంబరు 15 : ఏర్పడబోవు ఆంధ్రరాష్ట్రము యొక్క ఆర్థిక సొష్టతగురించి కొన్ని విస్పష్ట విషయములపై వివరణ కోరుచూ ఇండియాప్రభుత్వమునుండి మరియొక్క ఉత్తరము మదరాసు ప్రభుత్వమునకు చేరినట్లు ప్రధాని శ్రీ పి. యస్. కుమారస్వామిరాజాగారు నేడు విలేఖరులగోష్ఠిలో తెలిపిరి. విభజనసంఘంవారి నిర్ణయములను సూచనలను గత రెండు సమావేశములవి మదరాసుప్రభుత్వం ఇండియాప్రభుత్వమునకు పంపినమీదట ఇండియా ప్రభుత్వమునుండి పై లేఖ వచ్చింది.

మదరాసు ప్రభుత్వమువారు సూచించినట్లు ముగ్గురు సభ్యులుగల సరిహద్దు సంఘముగాక ఒకే వ్యక్తిగల సరిహద్దు కమిషను నియమించిన బాగుండుననియు రాష్ట్రనిర్మాణమునకు పూర్వమే సరిహద్దులు నిష్కర్షగా నిర్ణయము కావలెననియు ఇండియా ప్రభుత్వమువారు తమ లేఖలో పునరుద్ఘాటన చేసినట్లు కూడా


(4-వ పేజీ చూడుడు)


### హైకోర్టు విభజన విషయ సేకరణ
#### హఠాత్తుగా ఆపుదల

చెన్నపట్నం, డిసెంబరు 15 : మదరాసు రాష్ట్రమునుండి ఆంధ్ర రాష్ట్రమును విభజించుటకు కావలసిన విషయసేకరణకై హైకోర్టువారు కూడా ప్రభుత్వమునుండి తమకు సమయము ఆదేశము రావచ్చుననే అభిప్రాయముతో ప్రారంభించి కొన్ని వివరాలను సేకరించిరి. కాని ఇటీవల ప్రధాన న్యాయమూర్తి మదరాసుప్రభుత్వ ప్రధానిని కలుసుకొని మాటలు జరిపినమీదట, ఈ కార్యము ఆపివేయబడినట్లు తెలియుచున్నది.

### కేంద్ర సెక్రటేరియట్ గుమాస్తాల సిబ్బంది

న్యూఢిల్లీ, డిసెంబరు 15 : నేడు పార్లమెంటులో భారత ప్రభుత్వ ఆర్థికమంత్రి జాన్‌మత్తయిగారు 1949 సెప్టెంబరు 1 వ తేదీన కేంద్రసెక్రటేరియెట్‌లో 6718 మంది గుమాస్తాలు వున్నారనీ, వీరి సంఖ్య 1948 ఏప్రిల్‌లో 6258, 1939 లో 1272 అనీ సిధ్వాగారి ప్రశ్నకు సమాధానంగా ప్రకటించారు. 1950 ఏప్రిల్ లోపుగా 9 మాసాలలో వీరికి జీతం క్రింద రూ. 8051399 లు ఇవ్వవలసి వుంటుందనికూడా చెప్పారు. 1948-49 ఆర్థిక సంవత్సరంలో వీరి జీతాల మొత్తం 1,43,01,892 లు అన్నారు. 1939-40 లో వీరికి యిచ్చిన జీతాల మొత్తం రూ. 36,35,224 లు మాత్రమే. (యు. ప్రె)

## "స్టర్లింగ్ బాకీలలో ఆరో వంతును డాలర్లలో అమెరికా చెల్లించాలి"

### అమెరికన్ ప్రముఖ వ్యాపారస్థుల సూచన

న్యూయార్క్, డిసెంబర్ 14 : "బ్రిటన్ తాను చెల్లించకుండా స్తంభింపజేసిన స్టర్లింగ్ బాకీలలో 100 కి 15 వంతులను అమెరికా డాలర్లరూపంలో చెల్లించాలి" అని 20 మందికి పైగా అమెరికన్ బ్యాంకర్లు పారిశ్రామికులు నేటిరాత్రి సూచించారు.

ఈ మొత్తాన్ని 5 సం॥ లలో వాయిదాలలో చెల్లించాలని వారు సూచించారు.

అంతర్జాతీయ వాణిజ్యమండలియొక్క అమెరికన్ శాఖ ప్రపంచ ద్రవ్యపునర్నిర్మాణ పరిశీలనకై ఏర్పరచిన సంఘంలో వీళ్లు సభ్యులు. పరిశీలనానంతరం సమర్పించిన నివేదికలో వీరీసూచనను చేశారు.

"యుద్ధమూలంగా బ్రిటన్ అచ్చుకో వలసివచ్చిన స్టర్లింగ్ బాకీల పరిష్కారం విషయమై తక్షణం అమెరికా చర్యతీసుకోవాలి. ఇంకా బ్రిటనుకు మార్షల్ పథకంకింద సహాయం చేయాలంటే ఈబాకీలకు కొంతపరిష్కారం చేయటం అత్యవసరం" అని ఆనివేదిక హెచ్చరించింది.

సింసినాటి (ఓహియోరాష్ట్రం) లోని సెంట్రల్ ట్రస్ట్ కంపెనీ అధ్యక్షుడు మిచెల్ పరిశీలన సంఘానికి అధ్యక్షత వహించాడు. అతడు నివేదికకు ఉపోద్ఘాతం వ్రాస్తూ ఈ క్రింది హెచ్చరిక చేశాడు.

"ఇండియా, ఈజిప్టు, ఐర్ మొదలైన దేశాలకు తోడ్పడటానికై బ్రిటన్ అచ్చవలసినబాకీలను పరిష్కరించటమన్న అంశానికి మిగిలిన విషయాలన్నిటికన్నా యెక్కువ ప్రాధాన్యత ఇవ్వాలి. అమెరికా డబ్బును బ్రిటన్ తన అప్పులవాళ్ళకు చెల్లించినదంటే మన ప్రజలుకూడా బాకీల పరిష్కారంలో పాత్రవహించారని స్పష్టపడుతుంది. దీని ఎట్లా నిర్వహించవలసింది అన్న విషయం మీద పరిశీలన సంఘం ఏకాభిప్రాయానికి రాలేకపోయింది. అమెరికా ప్రభుత్వం బ్రిటన్‌తో సంప్రదించి ఒక పద్ధతిని నిర్ణయించవలసిందని సూచించింది.

స్టర్లింగ్ బాకీలన్నిటినీ తగ్గించో, తగ్గించకుండా ఒకటిగా కలిపి నిధిగా ఏర్పరచటం ఒకపరిష్కార పద్ధతి. కొంత బాకీని రద్దుచేసి స్తంభించబడిన బాకీలలో 100 కి 15 వంతులను 5 ఏళ్ళలో డాలర్ల రూపంలో చెల్లించటం, మిగిలిన భాగాన్ని చాలకాలంవరకూ కదిలించకుండా వుంచటం మరొక పద్ధతి."

### విశాఖపట్నానికి రాజాజీ ప్రయాణం

న్యూఢిల్లీ, డిసెంబరు 15: గవర్నర్ జనరల్ రాజగోపాలాచారిగారు తమ కుమార్తె నామగిరిని, మిలిటరీ కార్యదర్శి కర్నల్ ఛటర్జీని వెంటబెట్టుకొని నేడు ఉదయం విమానంలో విశాఖపట్నానికి బయలుదేరారు.

### గవర్నరు పునరాగమనం

విశాఖపట్నం, డిసెంబరు 15 : ఆంధ్రలోని తుపాను పీడిత ప్రాంతాలలో పర్యటించిన అనంతరం మద్రాసు గవర్నరు దంపతులు సపరివారంగా నేటి ఉదయం యిక్కడకు తిరిగి వచ్చారు. నేటి మధ్యాహ్నం ఢిల్లీనుండి ప్రత్యేక విమానంలో యిక్కడకు వస్తున్న ఇండియా గవర్నరు జనరల్ రాజగోపాలాచారిగారికి గవర్నరు దంపతులు స్వాగతమిస్తారు.

## ఇండియా భూటానుల స్నేహ ఒప్పందం

### పార్లమెంటులో నెహ్రూ వివరణ

న్యూఢిల్లీ, డిశంబర్ 14 : నేడు పార్లమెంటులో భారత ప్రధాని నెహ్రూ, పండిట్ ముకుట బిహారీలాల భార్గవా ప్రశ్నకు సమాధానంగా, 1949 ఆగస్టులో డార్జిలింగ్‌లో ఇండియా భూటానుల మధ్యజరిగిన ఒడంబడిక నకలు ప్రదర్శించారు.

ఈ ఒడంబడిక ప్రకారం ఇండియా భూటానుల మధ్య శాశ్వత శాంతి మైత్రి సంబంధాలుంటవి. దీనిని ఉభయ ప్రభుత్వాల సమ్మతితో సంస్కరించవచ్చును. భూటాను అంతరంగ పరిపాలనలో ఇండియా ఎట్టి జోక్యమూ కలిగించుకొనదు. భూటాను విదేశీవ్యవహారాల విషయంలో ఇండియా సలహాలను పాటిస్తుంది. ఒడంబడిక అమలులో వున్నంతకాలమూ ఇండియా భూటానుకు ఏటా 5 లక్షలరూపాయలిస్తుంది. ఒడంబడికపై సంతకాలు జరిగిన తేదీ లగాయతు ఏడాదిలోగా డ్యూఆంగిరి దగ్గర 32 చదరపు మైళ్ళ ప్రదేశాన్ని ఇండియా భూటానుకు తిరిగి ఇచ్చివేస్తుంది.

భూటాను ఇండియా యొక్క సమ్మతి సహకారాలతో ఇండియానుండి గాని, ఇండియాద్వారాగాని తన బలక్షేమాలకు అవసరమైన ఆయుధాలూ, యంత్రాలూ, యుద్ధపరికరాలూ దిగుమతి చేసుకోవచ్చు. ఇటువంటి దిగుమతులవల్ల తనకు ప్రమాదం లేదని ఇండియా భావించినంతవరకూ, ఇండియాభూటానుల సంబంధాలు సఖ్యంగా ఉన్నంతవరకూ ఈ ఏర్పాటుకు భంగం ఉండదు. ఈ విధంగాదిగుమతి అయిన వస్తువులను భూటాను ప్రభుత్వం గాని వ్యక్తులుగాని సరిహద్దులు దాటించి ఎగుమతిచేయటం జరగదని భూటానుమాట ఇస్తున్నది. పరస్పర శత్రువులను ఉభయదేశాలు పట్టి ఇవ్వగలవు.

ఈ ఒడంబడికలోని అంశాలను గురించి వివాదాలు కలిగితే వాటిని ముందుసంప్రతింపులద్వారా పరిష్కరించుకొన ప్రయత్నించాలి. మూడునెలల సంప్రతింపులవల్ల ఫలితంలేకపోతే మధ్యస్థ పరిష్కర్తలను ఏర్పాటుచేసి వారినిర్ణయం శిరసావహించాలి.

నేపాలుకూ ఇండియాకూ మధ్యఇటువంటి ఒడంబడిక జరుగనున్నదని డా. కేస్కరు చెప్పారు.

## సింధురాష్ట్రంలో హిందువులపై పాకిస్థాన్ దౌర్జన్యం

### భారతప్రభుత్వ అధిక్షేపణ

### బలవంతంగామతంమార్పుఆస్తిపాస్తులస్వాధీనం

న్యూఢిల్లీ, డిసెంబరు 14: సింధురాష్ట్రంలో మిగిలిన హిందువులందరినీ తరిమివేయటానికి పాకిస్థాన్ ప్రభుత్వం ఒకపథకాన్ని ప్రారంభించినదని ఆరోపిస్తూ భారతప్రభుత్వం పాకిస్థాన్ ప్రభుత్వానికి నేడొక అధిక్షేపణ పంపినట్లు తెలుస్తున్నది. హైదరాబాద్ (సింధు) నగరంలోని హిందువులనేకమందిని అర్ధరాత్రిపూట ఇళ్లలోనుంచి బయటికిలాగి, తరిమివేసిన సంగతిని భారతప్రభుత్వం దీనిలో ఉదహరించినట్లు తెలుస్తున్నది.

సింధురాష్ట్రపు లోపలి భాగాలలో హిందువులు ఇస్లాంమతం స్వీకరించమని నిర్బంధించబడుతున్నట్లు భారతప్రభుత్వానికి వార్తలువస్తున్నవని ఇక్కడి ప్రభుత్వవర్గాలు వెల్లడించారు. హిందూ పుణ్యక్షేత్రాలయిన బ్రహ్మమందిర్, సాధు హీరానందుని సమాధి మొదలైనవి ముస్లిములకివ్వబడినవనీ, కరాచీలోనూ, అనేక ఇతరప్రాంతాలలోనూ హిందువుల ఆస్తులు స్వాధీనం చేసుకోబడినవనీ తెలుస్తున్నది.

సింధులో మిగిలిఉన్న హిందువులందరూ దేశంవిడిచిపోయేట్లు చేసేనిమిత్తం పాకిస్థాన్‌ప్రభుత్వం హిందువుల దుకాణాలనూ, వ్యాపారసంస్థలనూ ఆక్రమించుకొంటున్నది.

శ్రీకాకుళం, డిసెంబరు 13 : నిన్నటివరకు యిక్కడ తెరుకరికలరావ్యాధి సోకి, 19 మంది మరణించారు. వ్యాధి ఉధృతం కాకుండా ఇంజెక్షన్లు విరివిగా యివ్వబడుచున్నవి. ఓట్లకింద కాఫీక్లబ్బులు మూసివేయబడినవి. (స్వ. వి.)

### ప్రపంచశాంతి కాముల సభ

నాగపూరు, డిసెంబరు 14: సేవాగ్రాంలో ప్రపంచ శాంతికాములసభ డిసెంబరు 24 తేదీన ప్రారంభమై ఒక వారమురోజులు జరుగును. భారతప్రధాని పండిత నెహ్రూగారు డిసెంబరు 31 తేదీన సభలో ఉపన్యాసము గావించెదరు. పండిత నెహ్రూగారు డిసెంబరు 31 తేదీన నాగపురము వచ్చి మ॥ రా॥ ముల గవర్నరు శ్రీ మంగళదాస్ పక్వాసాగారితో కలిసి సేవాగ్రాం వెళ్లి శాంతికాములతో కొన్ని గంటలు గడిపెదరు. ఆరోగ్యాభివృద్ధికై వార్ధాలో మకాము చేసియున్న డా॥ రాజేంద్రప్రసాద్‌గారు వార్ధా శాంతికాముల సమావేశములో పాల్గొందురని తెలియుచున్నది. అస్వస్థతవల్ల డా॥ రాజేంద్రప్రసాదుగారు శాంతినికేతనము వెళ్లజాలకపోయిరి.

## సాలుకు 5 కోట్లడాలర్లు సమితిసహాయపడితే రెట్టింపు ఆహారోత్పత్తి

### అంతర్జాతీయ ఆహారసంఘడైరెక్టర్ జనరల్ డాడ్ అభిప్రాయం

అట్టావా, డిశంబరు 14 : 'ఐక్యరాజ్య సమితి, యేటేటా, 5 కోట్ల డాలర్ల సహాయం చెయ్యకలిగితే ప్రపంచంలోని కొరత ప్రాంతాలన్నిటిలోనూ ఆహారోత్పత్తి రెట్టింపు పెరిగే మార్గాన్ని నేను చూపగలను' అని నారిస్ డాడ్ అన్నారు. ఈయన అంతర్జాతీయ ఆహార మండలి డైరెక్టర్ జనరల్.

'ఆ మొత్తాన్నియిస్తే ప్రస్తుతంవున్న సాంకేతిక విద్యానిపుణులను 250 నుంచి 750 మంది వరకూ పెంచి వివిధ దేశాలకు పంపి భూసారానికి సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానాన్నంతా కలుగజేయవచ్చు. చైనా, భారతదేశం, పాకిస్థాన్, యీజిప్టు దక్షిణ అమెరికా ప్రాంతాలలోని భూములు చాలా హీనస్థితిలో వున్నయ్.

ఐక్యరాజ్య సమితి యిప్పుడు ఈ మొత్తంలో సగంవంతుకూడా యివ్వటం లేదు.

# ప్రభుత్వోద్యోగులపై క్రమశిక్షణ చర్యలు

## ప్రభుత్వ ఆగస్టు నివేదిక

మదరాసు, డిశంబరు 13: ప్రభుత్వోద్యోగులపై ఆగస్టు నెలలో గత మాసాంతమునకు అమలులో వున్న వానితో చేర్చి 324 సరిపై అవినీతి నేరములు మోపబడెను. వీనిలో 14 సరిపై నేరములు రుజావు కానందున విడుదలచేయబడిరి. సెలాఖరుకు 294 మందిపై చర్య అమలులో వున్నది. నేరము రుజువైనందున 16 సరికి తగురీతిగా శిక్షలు విధించిరి.

ట్రిబ్యునల్ విచారించిన కేసులు: గెజెటెడ్ ఆఫీసర్లు; మదరాసు మెడికల్ సర్వీసుకు చెందిన సివిల్ సర్జన్ డా॥ సి. యస్. సూర్యనారాయణ శర్మ గారిని ఉద్యోగమునుండి ముందుగా విరమింపజేసిరి.

నాన్‌గెజిటెడ్ ఉద్యోగులు: తిరునెల్వేలిజిల్లా తహసిల్దార్ జాన్ జోసప్‌ను బర్తరఫు చేసిరి.

డిపార్టుమెంటు అధికార్లు విచారించిన కేసులు: నాన్‌గెజెటెడ్ ఉద్యోగులు:

1. రామచంద్రన్, కానిస్టేబుల్ 2. గోపాల్ కానిస్టేబుల్ 3. సుబ్రహ్మణ్యం, హెడ్ కానిస్టేబుల్‌ను బర్తరఫు చేసిరి. 4. యస్. రామచంద్రన్ రివిన్యూ డిపార్టుమెంటు సుపర్నెంటు ఆర్కాటు ప్రొహిబిషన్‌గార్డులు 5. నారాయణ 6. రాఘవేంద్రాచార్ 7. టి. పెరుమాల్ 8. ఎ. చొక్కనాథం 9. వడివేలులను ఉద్యోగమునుండి తీసివేసిరి. 10. పొల్లాచి, ఫిర్కా సప్లయి ఆఫీసరు కె. కృష్ణస్వామికి 6 నెలలు కఠిన శిక్ష విధించిరి.

నౌకర్లు 1. యస్. యం రాధాకృష్ణన్ 2. ఆర్. నటరాజన్‌లను ఉద్యోగమునుంచి తీసివేసిరి. 3. ప్రాసెస్ సర్వరు వి. లక్ష్మణనాయుకిని బర్తరఫు చేసిరి.

# నగరములో గవర్నరు జనరలు కార్యక్రమము

మదరాసు, డిశంబరు 13: భారత గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచారి గారు విశాఖపట్నం నుంచి డిశంబరు 17 ఉదయం 10/40కి మదరాసు చేరెదరు. గిండీ ప్రభుత్వభవనములో బసచేయుదురు.

డిశంబరు 17సా 4లకు మదరాసు మేయరును చూసెదరు. 4/30లకు సేవామందిరములో వాన్‌సైసు ప్రవర్తక కేంద్ర ప్రారంభోత్సవము చేసెదరు. తరువాత నావికాదినోత్సవము చేయుచున్న ఆఫీసర్ల ఇన్‌స్టిట్యూటు దర్శించెదరు.

మర్నాడు ఉదయం గవర్నరు జనరలు ఆడయార్‌లోని గాంధీనగర్‌కు వెళ్ళెదరు. తేనాంపేటలో ఖద్దరు ప్రదర్శనమును ప్రారంభించెదరు. సాయంత్రము రాజాజీ హాలులో సేవాసమాజం వార్షికోత్సవమునకు హాజరయ్యెదరు.

గవర్నరు జనరలు డిశంబరు 19న బయలుదేరి మైసూరు వెళ్ళెదరు.

# పి. డబ్ల్యు డి. మోటారు కార్మికులు

## మంత్రికి కార్మిక యూనియన్ విజ్ఞప్తి

మదరాసు, డిసెంబరు 14: పి. డబ్ల్యు. డి. మోటారు డ్రైవర్లకు, లారీ, రోడ్ రోలర్ క్లీనర్లకు ఇచ్చెదమన్న సౌకర్యములు కొన్ని నెలలు గడచినా ప్రభుత్వము ఇవ్వలేదనియు, పి. డబ్ల్యు. డి. మోటారు కార్మికులకు ప్రభుత్వ రవాణా ప్రమాణములో ప్రాతిపదిక వేతనము, బత్తా ఇవ్వవలెనని కోరుచు పి. డబ్ల్యు. డి మోటారు కార్మిక యూనియన్ కార్యదర్శి శ్రీ యం. సీతారాంనాయుడుగారు 8వ తేదీన మరమ్మతు ఇలాకా మంత్రికి ఒక విజ్ఞప్తిని అందజేసిరి.

మంత్రిగారు ఈ విషయములన్నిటినీ 15రోజులలోగా పరిశీలించెదమని హామీ ఇచ్చినట్లు తెలియుచున్నది.

# డిటెన్యూ విడుదల

మదరాసు, డిసెంబర్ 13: కమ్యూనిస్టుపార్టీ కార్యక్రమంలోను, విహాస్య చర్యలలోను పాల్గొననని హామీ ఇచ్చిన విశాఖపట్నంజిల్లా కమ్యూనిస్టు చిల్లా అప్పలస్వామిని విడుదల చేయవలెనని ప్రభుత్వము ఉత్తర్వు చేసెను.

# నెల్లూరుజిల్లాలో చెర్వుల మరమ్మతు

మదరాసు, డిసెంబరు 14: గత నవంబరు నెల వరదలవలన నెల్లూరుజిల్లాలో గండ్లుపడిన చెర్వుల మరమ్మతునుగురించి సమగ్ర పరిశోధన నిమిత్తము నెల్లూరు ఎగ్జిక్యూటివు డివిజను క్రింద అదనముగా ఒక సబ్ డివిజన్‌ను ప్రభుత్వము మంజూరు చేసెను. ఈ సబ్‌డివిజన్ ప్రధాన కార్యాలయము పొదిలిలోగాని దర్శిలోగాని వుండును.

# దేశంలో చక్కెర ఉత్పత్తి

## ఆహారమంత్రి ఉద్బోధ

### మిల్లు యజమానుల సంఘ వార్షిక సమావేశం

న్యూఢిల్లీ, డిసెంబర్ 13: అఖిల భారత పంచదారమిల్లుల సంఘ వార్షిక సమావేశానికి ప్రారంభోత్సవం చేస్తూ భారత ప్రభుత్వ ఆహారశాఖామంత్రి జయరామదాస్ దౌలత్‌రామ్ ఇలా ప్రసంగించారు:

'అధికోత్పత్తికి ప్రభుత్వం అమలుజరుపనున్న క్రొత్త విధానంలో పంచదార చెరుకు పండించే భూభాగాన్నేమీ పరిమితం చేయటంలేదు. పంచదార పరిశ్రమ అభివృద్ధిచెందాలంటే ఆ పరిశ్రమ దేశంలోని ప్రజలలో పలుకుబడి సంపాదించుకోవాలి.

బీహారు-సంయుక్తరాష్ట్రాల పంచదార కంట్రోలు సంయుక్తమండలి పంచదార ధరను రు 28-8-0 చొప్పున నిర్ణీతం చేయటానికి అంగీకరించింది. ఈ మండలిలో పారిశ్రామిక ప్రతినిధులూ, కార్మిక ప్రతినిధులూ, ప్రభుత్వ ప్రతినిధులూ కూడా వున్నారు. ఈ నిర్ణయాన్ని 'ఇండియన్ షుగర్ సిండికేట్' కూడా ఆమోదించింది. సక్రమంగా అరేటుకు అందజేస్తారనే ఉద్దేశంతో, పంచదారమీదవున్న కంట్రోళ్ళన్నీ యెత్తివేశాం. కాని దురదృష్టవశాత్తూ జూలై వచ్చే టప్పటికి యీ ఒడంబడికను భగ్నం చేశారు.

'ఈ సంఘం అధ్యక్షుడు "ప్రభుత్వం జోక్యంవల్లనే పంచదార ధరలు యిలా పెరగటం జరిగింద"ని సూచించారు. పారిశ్రామికులు తాము ప్రభుత్వంతో చేసుకున్న ఒడంబడికకు భిన్నంగా ప్రవర్తించుతూ, యిష్టంవచ్చినంత వసూలుచేస్తూ, పంచదార దొరక్కుండాపోయి ప్రజలు నానా యిబ్బందులూ పడుతుంటే ప్రభుత్వం చేతులుముడుచుకు చూస్తూ కూర్చోవటం యెలాసాధ్యం? ఈ విషయం మీద నేనెక్కువ మాట్లాడదలచలేదు. పంచదార ఉత్పత్తులు పెరగటానికి ఈ పరిశ్రమతో సంబంధమున్న ప్రతి వర్గంతోనూ ప్రభుత్వం చేతనైనంతవరకు సహకరించాలనే అపేక్షతోనే వున్నది. కాని ప్రజల యిబ్బందిని ఉపేక్షించటం మాత్రం జరగదు.

'50 వేల టన్నులు దొంగతనంగా పాకిస్థాన్ చేరిందని మరోమాట చెప్పారు. పాకిస్థాన్‌కు యెగుమతి చేసుకోవటానికి యెటువంటి నిరోధమూ లేనప్పుడు దొంగతనంగా పంపవలసిన ఆగత్యమేమిటి? అయినా అక్కడకు పంపటానికి యిక్కడవున్న బ్లాక్ మార్కెట్‌కంటే పాకిస్థాన్‌లో పంచదార ధరయెక్కువగా లేదే!

'15,000 టన్నులు సరిహద్దు రైల్వే కేంద్రాలకు ఎగుమతి చేయబడినట్టు మరోమాట చెప్పారు. దాన్ని విచారించాం. అలాంటిదేమీ జరగలేదని తేలిపోయింది. పాకిస్థాన్‌కు వెళ్ళిందల్లా: 3,287 టన్నుల పటిక బెల్లం, 8000 టన్నుల పంచదార పాకం, ముడికలకండా మాత్రమే. ఇది భూమార్గాన వెళ్ళింది. ఇక సముద్రంమీద వెళ్ళిందల్లా మొత్తం 74 టన్నులు. ఇది 1949 మార్చి-జూలై అంకెలు.

'ప్రతి ప్రధానవిషయంలో నూ పారిశ్రామిక ప్రతినిధులను సలహా చేయ్యాలని మరోసూచన చేశారు. మంచిదే కాని ప్రజలు యిబ్బందులు పడుతున్నప్పుడు వెంటనే తగిన చర్యలు తీసుకోకుండా ఆగటానికి వీలులేదు.

'పంచదార పరిశ్రమ లున్న ప్రాంతాలలో మంచిరకం చెరుకును యెక్కువగా పండించే ఏర్పాటు చేయించటానికి ప్రభుత్వం రాష్ట్రప్రభుత్వాలతో ఆలోచించి తగిన చర్యలన్నీ తీసుకుంటుంది.

'చెరుకుమీద వేసిన పన్నును తగ్గించే విషయం, ప్రభుత్వం ఇంకా ఆలోచిస్తున్నది. త్వరలో ఈవిషయమై ప్రకటన జరుగుతుంది. పంచదార చెరుకును బెల్లం చేయటానికి వినియోగించరాదని మీ సంఘం చేసిన సూచన బాగానే వుంది. ఈ విషయమై కొన్ని చర్యలు తీసుకున్నాం. ఇంకా తగినచర్యలు తీసుకోవటానికి ప్రభుత్వం ఆలోచించుచున్నది.

'ఈ పరిశ్రమ పురోభివృద్ధికి గావాలంటే ఇటీవలి సంఘటనలను బట్టిచూస్తే, కేంద్ర రాష్ట్రప్రభుత్వాలున్న ఈ విషయమై ఇంకా సాన్నిహిత్యం వుంటేగాని వీలుపడదు తోస్తున్నది. దీనికిగాను ఒక కేంద్రసంఘాన్ని స్థాపించటం అవసరంగా కనుపిస్తుంది. టారిఫ్‌బోర్డు నివేదిక అందిన అనంతరం ఈవిషయమై సక్రమమైనచర్యలు తీసుకుంటాం. ఈపరిశ్రమ ప్రజలలోనూ సానుభూతి సంపాదించుకుని అభివృద్ధికి రావలెనని ఆశించుచున్నాను.' అన్నారు.

# ఆంధ్రరాష్ట్ర ఆర్థిక స్వయంసంపూర్ణత

## శ్రీప్రకాశంగారి ప్రకటన

మదరాసు, డిశంబరు 14: మదరాసు ప్రధాని శ్రీ కుమారస్వామిరాజాగారు పత్రికా విలేఖరులగోష్టిలో వెలిబుచ్చిన అభిప్రాయములు గమనించినాను. ఆంధ్రరాష్ట్ర ఆర్థికస్థాయి గురించి ప్రస్తావించిరి. ఆంధ్రరాష్ట్రమునకు పెద్దలోటు రాగలదనే ధార్ కమిషన్‌వారి అంచనా సద్దతప్ప అని నా అభిప్రాయం. ఆదాయ న్యాయములు పరిశీలించబడుచున్నవి. ఆంధ్రరాష్ట్రము ఆర్థికముగా స్వయం సమృద్ధముగా వుండగలదని నా అభిప్రాయం పరిశీలనా ఫలితముకూడ చూద్దాము" అని శ్రీ ప్రకాశం పంతులుగారు నేడొక ప్రకటనలో తెలిపిరి.

# సిబ్బంది నిర్ణయ ఉపసంఘ సమావేశము

మదరాసు, డిశంబరు 14: ఆంధ్రరాష్ట్ర నిర్మాణము సందర్భమున సిబ్బంది నిర్ణయ ఉపసంఘ సమావేశము రెండవసారి నేడు సెక్రటేరియట్‌లో మంత్రివర్గ మందిరమున జరిగెను.

ప్రధాన కార్యదర్శి శ్రీ కె. రామునిమీనన్, హోంశాఖ కార్యదర్శి శ్రీ జి. పుల్లారెడ్డి, విభజన సంఘ కార్యదర్శి శ్రీ వెంకటేశ్వరన్ హాజరైరి.

విభజన సంఘ కార్యదర్శి ప్రశ్నావళికి జవాబులు పంపిన శాఖాధిపతులతో వారు పంపిన భోగట్టాను గురించి చర్చించినట్లు తెలియుచున్నది.

ఇవ్వాళ ఉపసంఘమువారు, రివిన్యూ బోర్డు అధికార్లు, సివిల్ సరఫరా ఇతర శాఖల అధికార్లు, ఇన్‌స్పెక్టరు జనరలు ఆఫ్ రిజిస్ట్రేషను, సహకార సంస్థల రిజిస్ట్రారు ట్రాన్సుపోర్టు కమిషనర్ లోకల్ ఫండ్ అకౌంట్సు ఎగ్జామినర్, వ్యవసాయ శాఖ డైరెక్టరులతో సమాలోచనలు జరిపిరి.

సిబ్బంది నిర్ణయ సంఘము సకాలములో పని పూర్తిచేసి డిశంబరు 21న జరుగు విభజనసంఘ సమావేశమునకు నివేదిక అందజేయగలదని తెలియుచున్నది.

సిబ్బంది నిర్ణయ సంఘము, ఆర్థిక సంఘము మరల గురువారం సమావేశమగును.

# శ్రీ జి. యం. మాక్ కెల్వీ

మదరాసు, డిసెంబర్ 13: ఇండియా ప్రభుత్వ రహదార్ల ఇంజినీరింగు సలహాదారుడు శ్రీ జి. యం. మాక్ కెల్వీ మదరాసువచ్చిరి. వీరు గోదావరి మీద ఆలమూరుదగ్గర కట్టేటంతెన కట్టుస్థావరమును వెళ్ళి తిరుగు ప్రయాణంలో నెల్లూరుదగ్గర పెన్న వంతెననుకూడ చూచెదరు.

# కిరసనాయిల్ ధర

మదరాసు, డిసెంబరు 13: మదరాసు నగరములో కిరసనాయిల్ చిల్లరధర 24 ఔన్సుల సీసా ఖరీదు 0-3-1గ మార్చుచు డిసెంబరు 3వ జారీచేసిన వుత్తర్వు నిలిపి వేయబడినదనియు, నగర రేషనింగ్ ఆఫీసరు నవంబరు 29న నిర్ణయించినట్లు సీసా 0-3-6 గాలను రు 1-3-7లు దరలు యిమలులో వున్నవని మదరాసు కలెక్టరు ప్రకటించుచున్నారు.

# ఆంధ్ర సెనేట్‌కు ఎన్నిక

వాల్తేరు, డిసెంబర్ 10: ఆంధ్ర విశ్వకళాపరిషత్ సెనేట్‌కు అనంతపూర్ జిల్లా స్థానిక సంస్థలతరపున సభ్యులుగా జిల్లాబోర్డు సభ్యుడు డి. లక్ష్మన్నగారు, హిందూపుర పురపాలక సంఘసభ్యుడు గౌరా. శ్రీరాములుగారు ఎన్నుకోబడినారు.

# సమావేశ తీర్మానాలు

ప్రారంభోపన్యాసం అనంతరం ఈ సంఘం ఈ దిగువ తీర్మానాలను ఆమోదించింది.

1. పంచదార ధర పెరగటానికి కారణం ప్రభుత్వ జోక్యమే. టారిఫ్ బోర్డువారి సూచనప్రకారం చెరుకుధరను రు 1-1-0 చొప్పున ఆగస్టులోనే నిర్ణీతంచేసివుంటే ఇలా ధర పెరగటానికి సావకాశం వుండేది గాదు.

2. ఫ్యాక్టరీల ప్రాంతాలలో బెల్లమూ, పటికబెల్లమూ తయారు చేయకుండా నిషేధించకపోతే పంచదార ఫ్యాక్టరీలు అనుకున్న మొత్తాల పంచదారను తయారుచేయటం సాధ్యంకాదు.

3. చెరుకును అధికంగా పెంచే యేర్పాటు చేయించాలి.

4. చెరుకు పన్ను తగ్గించాలి.

5. ప్రభుత్వం తన కార్మిక విధానాన్ని మార్చుకుని కూలీలను తగ్గించివేయటానికి సావకాశం యివ్వాలి.

6. సాంకేతిక విద్యా నిపుణులను విదేశాలకుపంపి, ఆయా దేశాలలో అమలు జరుగుతున్న అభివృద్ధి కార్యక్రమాల వివరాలు తెలుసుకోవాలి.

7. పరిశోధనా కేంద్రాలను స్థాపించుకోవటానికి ఫ్యాక్టరీలకు సహాయం చెయ్యాలి.

8. చెరుకు రవాణాకు తగినరోడ్లు నిర్మించాలి.

### నోటీసు

మద్రాసు హైకోర్టు ఆఫ్ జూడికేచర్
ఆర్డినరి ఒరిజనల్ సివిల్ జూరిస్‌డిక్షన్.
సి. ఎస్. నం. 36 ఆఫ్ 1949.

వాది: శ్రీ రాజా వెంకటనరసింహ అప్పారావు బహదూరువారు.

ప్రతివాదులు: (1) శ్రీ రాజా వెంకటరామయ్య అప్పారావు బహదూరువారు, (2) జాస్తి రామబ్రహ్మం, జాస్తి నాగభూషణం కుమారుడు రామబ్రహ్మంకు, విజయవాడ డి. ఎం సి. లో చేరిన కొవరపల్లి.

ఇందుమూలమున తెలియపరచునదేమనగా, ప్లెయింటు షెడ్యూలు భూమికి సంబంధించిన ఒక విక్రయపత్రము వ్రాసి యిచ్చుట గాని, అందుకు ప్రత్యామ్నాయముగా రు 10,000/-లు నష్టపరిహారము యిచ్చుట గాని ఒక నిర్దిష్టమైన పని చేయుటకు గాను, 1, 2 ప్రతివాదులమీద పైన తెలిపిన వాది పై దావా దాఖలు చేసియున్నాడు. దావా చేయుటకు, 6-12-48 తేదీన హైకోర్టువారు అనుమతి యిచ్చియున్నారు. హైకోర్టు ఫైలు నం 4500/49 దరఖాస్తులో 7-12-49 తేదీన కోర్టువారి ఉత్తరువు ప్రకారము నీ మీద సబ్‌స్టిట్యూటెడ్ సర్వీసు ఆర్డరు చేయబడినది. ఒరిజనల్ సైడ్ రూల్సు ప్రకారము అనుమతింపబడిన కాలములోగా నీవు కోర్టుకు హాజరై డిఫెండు చేసుకొననియెడల నీపరోక్షమున దావా కొనసాగింపబడును.

కే. వి. రంగాచారి,
సి హెచ్. సూర్యనారాయణరావు,
వాది తరఫు కౌన్సెల్.
మద్రాసు, 13-12-49.





## రేడియో ప్రోగ్రాంలు
డిసెంబరు 17 శనివారం

### మద్రాసు (ఎ)

ఉ॥ 7-30 యస్. జానకిపాట. 8-0 అంగ్లమున వార్తలు. 8-15 ఉదయ సంగీతం రికార్డులు. 8-30 మద్రాసు (బి)వలె. మ॥ 1-0 మద్రాసు (బి) వలె. 1-30 అంగ్లమున వార్తలు. 1-40 సినిమా సంగీతం రికార్డులు. 4-0 పిల్లల కార్యక్రమం తెలుగున 4-30 పాశ్చాత్య సంగీతం రికార్డులు. సా॥ 5-30 రాజేశ్వరి మిారాబ్ వీణ. 6-0 అంగ్లమున వార్తలు. 6-20 ఎస్. అర్. జయలక్ష్మి పాట. 7-0 ఎ. ముత్తప్ప వయొలిన్. 7-30 గీతమంజరి రికార్డులు. 7-45 మహారాజపురం విశ్వనాథయ్యర్ పాట. 9-0 అంగ్లమున వార్తలు. 9-15 మద్రాసు ప్రభుత్వ అభివృద్ధి ప్రణాళికలు. అంగ్లమున ప్రసంగం. 9-30 మద్రాసు (బి) వలె. 10-0 పాశ్చాత్య సంగీతం రికార్డులు.

### మద్రాసు (బి)

ఉ॥ 7-0 తెలుగున వార్తలు. 7-15 సాత్తూర్ సుబ్రహ్మణ్యం రికార్డులు. 7-45 మద్రాసు (ఎ) వలె. 8-30 బాలానందం. నిర్వహణ న్యాపతి కామేశ్వరి. మ॥ 1-0 మహిళామండలి లేపాక్షి బసవయ్య బాపిరాజు గేయం. ఆధునిక ప్రపంచ సాహిత్య నిర్మాతలు. థోరియం. ప్రసంగం. పి. కల్పకం. 1-30 మద్రాసు (ఎ) వలె. 1-50 తెలుగున వార్తలు. 4-0 మద్రాసు (ఎ) వలె. సా॥ 5-30 మద్రాసు (ఎ) వలె. 6-20 సాయం సంగీతం రికార్డులు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం. ప్రాచీన భారత రాజ్యాంగ విషయాలు. స్థానిక స్వపరిపాలన ప్రసంగం. భావరాజు వెంకట కృష్ణారావు, నానక్ భజన్. 7 తెలుగున వార్తలు. 7-15 ఫిల్మ్ సంగీతం (రి.) 7-45 మద్రాసు (ఎ) వలె. 9-30 తురయూర్ రాజగోపాలశర్మ, రికార్డులు. 9-45 ఘంటసాల వెంకటేశ్వరరావు, ఎ. ఐ. ఆర్. ఆర్కెస్ట్రాసహా. 10 శాస్త్రీయ సంగీతం (రి.)

### విజయవాడ

ఉ. 7 తెలుగున వార్తలు. 7-15 ఎస్. వి. సుబ్బయ్య భాగవతార్, రికార్డులు. 7-30 అబ్దుల్ అజీజ్. 8 అంగ్లమున వార్తలు. 8-15 శ్రోతలు కోరినపాటలు. 8-30 ఎస్. సి. హెచ్. కృష్ణమాచార్యులు, వయొలిన్. మ. 1 తారాపథం (రి.) 1-30 అంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు. 4 బొమ్మరిల్లు, మామయ్య మాటకారితనము. నాటిక, తీగపులించే పాట. మన పరిసరాలు, అచ్చుయంత్రముకథ, తపాలాసంచి. సా. 5-30 అబ్దుల్ అజీజ్. 6 అంగ్లమున వార్తలు. 6-20 గీతమంజరి, బాలా త్రిపురసుందరి రికార్డులు. 6-30 గ్రామస్థుల కార్యక్రమం (మద్రాసునుండి.) 7 తెలుగున వార్తలు. 7-30 ఉభయకుశలోపరి శ్రోతల ఉత్తరాలకి జవాబులు. 7-45 మద్రాసువలె. 9 అంగ్లమున వార్తలు.

### హైద్రాబాదు

ఉ॥ 7-30 సుబ్బులక్ష్మి రికార్డులు. 7-40 ఎల్. ఎన్. సాస్లే ఖయాల్ దేసి. 8-0 అంగ్లమున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే). 8-20 ఎం. ఎస్. మహాదేవన్ కర్నాటక సంకీర్తం. 8-50 తెలుగున వార్తలు. 9-15 సుశీలాబాయి తుమ్రి ఘజల్. మ॥ 12-30 నూర్‌జహాన్, సురయా రికార్డులు. మ 1-0 రికార్డులు. 1-30 అంగ్లమున వార్తలు. 1-50 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే). సా5-0 సుశీలాబాయి తుమ్రి. 5-15 ఎల్. ఎన్. సాస్లే ఖయాల్ శ్యాం కళ్యాణ్. 5-25 మహబూబ్ బేగ్ దాద్రా గీత్. 6-30 గ్రామస్థుల కార్యక్రమం, తెలుగున. గ్రామారోగ్యం, ప్రసంగం. మురహరిరావు గీతావళి, కె. వెంకటేశ్వరరావు. 7-0 తెలుగున వార్తలు (ఎ. ఐ. ఆర్. రిలే). 7-50 మహబూబ్ బేగ్ ఘజల్ గీత్. 8-30 ఎల్. ఎన్. సాస్లే ఖయాల్ భాటియార్. 8-45 ఎం. ఎస్. మహాదేవన్ కర్నాటక సంగీతం. 9-0 అంగ్లమున వార్తలు. 9-15 శ్రోతల పరిచయం. 9-30 సుశీలాబాయి భజన్. 9-55 సుశీలాబాయి తుమ్రి. 10-5 ఎల్. ఎన్. సాస్లే ఖయాల్. 10-20 మహబూబ్ బేగ్ దాద్రా ఘజల్. 10-35 హమీర్ కళ్యాణ్ ఆర్కెస్ట్రా.

# హిందూధర్మశాస్త్ర క్రోడీకరణపై పార్లమెంటులో వాదోపవాదాలు

## సోమవారం నాటికి చర్చ సమాప్తి

న్యూఢిల్లీ, డిసెంబరు 14: పార్లమెంటులో ఈ వేళకూడా హిందూ ధర్మ క్రోడీకరణ చట్టంపై చర్చ సమాప్తం కాలేదు. చర్చ సోమవారం నాటికి పూర్తి కాగలదనీ, ఆ నాడు డాక్టరు అంబేద్కరు చర్చకు సమాధానం చెప్పగలరనీ తెలుస్తున్నది.

లాహోరు హైకోర్టులో న్యాయమూర్తిగా ఉండిన డాక్టరు భక్షీ టేక్‌చంద్ ఈ వేళ మాట్లాడుతూ, చట్టంపై మాట్లాడిన అనుకూలురు, ప్రతికూలురు కూడా మతోన్మాదులు లాగ మాట్లాడారనీ, ఈ చట్టం జాగ్రత్తగా పరిశీలింపవలసి ఉన్నదనీ, హిందూ కుటుంబంలోని స్త్రీలకు పూర్తి సౌకర్యాలు కలిగించడమే ఈ చట్టం ఉద్దేశ్యమనీ, దీనివల్ల దేశంలో ఆయా భాగాల్లో అమలులో ఉన్న హిందూధర్మానికి నష్టం కలగకుండా చూడాలనీ, అయితే ప్రస్తుతం శాసనసభలో చర్చించబడుతున్న ఈ చట్టం వల్ల, హిందూసంఘానికి ఎక్కువగా నష్టం కలుగుతుందనీ, స్త్రీలకు చాలా తక్కువ ఉపయోగాలు కలుగుతాయనీ అన్నారు.

ప్రజల అంగీకారం పొందిన తరవాతనే ఈ చట్టం ఆమోదించాలన్న సూచనతో తాముకూడా ఏకీభవిస్తున్నామని గోకుల్ భాయ్‌భట్ అన్నారు.

ప్రొఫెసరు కె. టి. షా ఈ బిల్లుకు తమ సంపూర్ణామోదం తెలియబరచారు.

ఆ పిమ్మట ఎ. వి. మునిస్వామిపిళ్లె మాట్లాడుతూ, ఈ చట్టాన్ని తాము పూర్తిగా ఆమోదిస్తున్నామనీ ప్రభుత్వం ఎప్పుడు సంస్కరణలు తలపెట్టినా ప్రజలలో ప్రాతికూల్యం రావడం సహజమేననీ, మద్రాసులో దేవాలయ ప్రవేశచట్టం ఆమోదించే సందర్భంలో ప్రతికూలురు మంత్రుల కళ్లలో కారం చల్లారనీ చెప్పారు.

కపూర్తలా హైకోర్టులో మాజీన్యాయమూర్తిగా ఉన్న సర్దార్ హుకుంసింగ్ మాట్లాడుతూ హిందూ ధర్మ క్రోడీకరణ చట్టం సిక్కులకుకూడా వర్తించాలని అన్నారు.

నిన్న ఈచట్టం అంతగా ప్రధానమైనది గాదని చెప్పిన ఆచార్య కృపాలనీ ఈ వేళ తామీ చట్టానికి సంపూర్ణంగా తమ ఆమోదాన్ని తెలియజేస్తున్నామని చెప్పగానే సభ్యులందరికీ ఎక్కువగా ఆశ్చర్యం కలిగింది. ఆయన మాట్లాడుతూ మన దేశస్థులకు హాస్య దృక్పథం లేదనీ అందుచేతనే సభ్యులు నిన్న తన ప్రసంగాన్ని అపార్థం చేసుకోవడం జరిగిందనీ చెప్పారు.

దీనిపై ఒ. వి. అలగేశన్ వ్యంగ్యగర్భితంగా మాట్లాడు నిన్నటి వ్యంగ్యప్రసంగం ఒక్కరాత్రిలో ధర్మప్రసంగంగా మారిపోయిందని అన్నారు. అలగేశన్ ఇంకా మాట్లాడుతూ, స్త్రీ పక్షపాతులు ఇంకా కొంతకాలం కాచికుంటే హిందూసంఘం మీద మలబారులోని యాత్రీయ ధర్మ సూత్రాలుకూడా విధించవచ్చుననీ, స్త్రీలు వారిని సులభంగా 'అవినీతి' లోనికి దించి వేయగలరనీ అన్నారు. అపైన అధ్యక్షుడు కలగజేసుకోవడంవల్ల అలగేశన్ తాము ఉపయోగించిన అవినీతిపదాన్ని ఉపసంహరించుకున్నారు.

ఈ వేళ చర్చ ప్రారంభంలో అధ్యక్ష స్థానంలో ఉన్న అయ్యంగారు లేచినిన్న తమ ఉపన్యాసం పూర్తి చెయ్యలేదని ఆచార్య కృపలానీ తమకు ఒక లేఖ వ్రాశారనీ అందుచేత కృపలానీగారిని ఈ వేళ మొదట మాట్లాడటానికి అనుమతిస్తున్నామనీ అన్నారు.

అపిమ్మట ఆచార్యకృపాలనీ మాట్లాడుతూ మనదేశంలో హాస్యం లేకపోవడం వల్ల సభ్యులు తమ ప్రసంగాన్ని అపార్థం చేసుకున్నారనీ, తాము ఈచట్టానికి సంపూర్ణంగా ఆమోదిస్తున్నామనీ, తాము భారతీయ మహిళల శీలం సంపూర్ణంగా అవగాహన చేసుకున్నామనీ అన్నారు.

ఆచార్య కృపాలనీ ఇంకా ఇల్లా అన్నారు: "మనచరిత్రలో భారత మహిళలసేవ అపారమైనది. అనేకమైన విదేశాక్రమణలు జరిగినా మన సంప్రదాయాన్ని సంస్కృతినీ వారు భద్రంగా సంరక్షించారు. మహాత్మాగాంధీ స్త్రీలలోని ఈ మహాశక్తిని గుర్తించి, దానిని దేశసేవకై వినియోగించారు. ఒక వంగ వక్త ఈ చట్టాన్ని వ్యతిరేకించడం సముచితంగాలేదు, ఆయనకు వంగం వితంతువుల మర్చిపోయి తెలియదని భావిస్తున్నాను. స్త్రీలకు ఆస్తివున్నా, వారిలో ఉన్న భక్తివిశ్వాసాలకు ఏమీలోపం వుండదు. నా భార్య అనునాతన భావాలు కలదే! అయినా ఆమె గృహిణీధర్మాలు చక్కగా నిర్వహించుకుంటూనే ఉన్నది. మేమున్న ప్రాంతంలో అవిభక్తకుటుంబపద్ధతి లేదు. అయినా మా స్త్రీలు గృహిణీధర్మం నిర్వహిస్తూనే ఉన్నారు. మారుతూన్న పరిస్థితులకు అనుకూలంగా మారుతూండడమే హిందూధర్మంలోని గొప్పదనము. ప్రత్యేక సంఘంలో ఈ వున్న చట్టానికి అవసరమైన కొన్ని మార్పులు చేస్తారనీ, దీనివల్ల హిందూ సంఘానికి ఏ విధమయిన లోపమురాదని విశ్వసిస్తున్నాను."

అనంతరం రాజస్థాన ప్రతినిధి గోకుల భాయ్‌భట్ మాట్లాడుతూ, ఈ చట్టం విషయంలో ప్రజాభిప్రాయం పూర్తిగా కనుక్కోవాలనీ, రావుకమిటీ ఒక రెండు నెలలే దేశంలో సంచారం చేసిందనీ, అందుచేత అది దేశంలోని 30 కోట్ల జనాభా అభిప్రాయం కనుక్కోడానికి అవకాశమే లేదనీ, దేశం అంతటిలోను ఈచట్టం కాపీలు 60 వేలు మాత్రమే ప్రచారమయ్యాయనీ, పల్లెల్లోని ప్రజలకీ గొడవే తెలియదనీ అన్నారు.

భట్ ఇంకా మాట్లాడుతూ పార్సీలు వెనక తమ సంఘంలో సంస్కరణ జరపదలచినప్పుడు ప్రజల అందరి అభిప్రాయాలు కనుక్కున్నారనీ, వారి దేశంలోని పార్సీల అభిప్రాయాలేకాక విదేశాలలోని పార్సీల అభిప్రాయాలు కూడా కనుక్కున్నారనీ, అల్లాగే హిందూ ధర్మ క్రోడీకరణ చట్టం విషయంలో అందరి అభిప్రాయాలు కనుక్కోవాలనీ, దీనికి తగినంత వ్యవధి కావాలనీ అన్నారు.

భట్ ఈ విషయంలో ఇంకా మాట్లాడుతూ, ఈ విషయంలో ప్రజా అభిప్రాయం తెలుసుకోవాలంటే వచ్చే ఎన్నికలలో కాంగ్రెసు ఈ విషయాన్ని ఎన్నికలలో సమస్యగా పెట్టాలనీ, అందుచేత ఈ చట్టాన్ని ఇంకా కొన్ని సంవత్సరాల దాకా వాయిదా వెయ్యాలనీ, ఇది చెయ్యడానికి వీలులేకపోతే ప్రభుత్వం ఈ విషయంలో మధ్యేమార్గం అవలంబించాలనీ అన్నారు.

అనంతరం భట్ ఈ చట్టం విలీనకృతములయిన సంస్థానాల ప్రజాభిప్రాయం కోసం పంపబడుతుందన్న అంబేద్కర్ ప్రకటనను గురించి మాట్లాడుతూ దీనివల్ల సంస్థాన ప్రజలకు చాలా అన్యాయం జరుగుతుందనీ, ఈ చట్టం విషయంలో తీవ్రమైన వాదోపవాదాలు చెలరేగుతున్నాయనీ, డాక్టరు రాజేంద్ర ప్రసాద్, పట్టాభివంటివారే యీ బిల్లుకు వ్యతిరేకిస్తున్నారనీ అన్నారు.

ఆ పిమ్మట డాక్టరు భక్షీ టేక్‌చంద్ మాట్లాడుతూ ప్రతిపక్షులు కొంతమంది పార్లమెంటుకు సంస్కరణ విషయంలో చట్టాలు నిర్మించడానికి అధికారంలేదనీ అన్నారనీ, అది కేవలము పొరబాటనీ సహగమన చట్టం మొదలుకొని శాసన సభలలో అనేక సంస్కరణ చట్టాలు ఆమోదింపబడ్డాయనీ, ఒక నూరు సంవత్సరాల శాసనసభా చరిత్రచూస్తే అనేకమైన సంస్కరణ చట్టాలు కనిపిస్తాయనీ అన్నారు.

అపైన డాక్టరు టేక్‌చంద్ ఇంకా యిల్లాగ అన్నారు. "ఈ వెనక చేసిన చట్టాలన్నీ అమలులోకి వచ్చినప్పుడు హిందూధర్మం ఏమైనది? మనకు వర్గరహితము, వర్ణరహితము అయిన సంఘం కావాలి. వివిధ వర్ణాల మధ్య జరిగిన వివాహాలను చట్ట సమ్మతంచేసే బిల్లు ప్రవేశపెట్టబడినపుడు ఎవరూ దానిని ప్రతిఘటించలేదు. అందుచేత ఈ చట్టం ప్రవేశపెట్టడానికి వీలులేదని అనడానికి ఎవరికీ అధికారంలేదు".

ఆ పిమ్మట డాక్టరు టేక్‌చంద్ చట్టంలోని మంచిచెడ్డలను విమర్శిస్తూ, ఈ చట్టం సమగ్రమైనదికాదనీ, కుమార్తెలకు తండ్రి ఆస్తిలో పూర్తిగా హక్కుండాలనీ, మనం తల్లులకు, సోదరీలకు పూర్తిగా ఆస్తిలో అధికారాలు కలగజెయ్యాలనీ, మితాక్షర మయూఖ 4 వ్యాఖ్యానాలు పూర్తిగా ఈ దృక్పథాన్ని సమర్థిస్తున్నాయనీ అన్నారు.

డాక్టరు టేక్‌చంద్ ఇంకా మాట్లాడుతూ, చట్టం సమర్థించేవారు దీన్ని ఉన్నది ఉన్నట్టుగా అంగీకరించవలసిందని అంటున్నారనీ, ఇంత అసంబద్ధము. సంపూర్ణము అయిన చట్టము ఒకటి ఏదీ లేదనీ, దీనివల్ల హిందూ సంఘానికి పూర్తిగా నష్టం కలుగుతుందనీ, స్త్రీలకు వచ్చే సౌకర్యాలు చాలా తక్కువనీ అన్నారు.

ఈ మాటకు సభ్యులలో హర్షనినాదాలు బయలుదేరాయి.

టేక్‌చంద్ ఇంకా ఇల్లాగ అన్నారు: "ఈ చట్టంలో ఒక నిబంధనలో స్త్రీలకు వ్యవసాయానికి సంబంధించిన భూముల మీద వారసత్వం హక్కు లేదని ఉన్నది. మనదేశంలో నూటికి 90 పాళ్లు ఆస్తి అంతా వ్యవసాయానికి సంబంధించినదే. అల్లాగే ఇళ్ళలో కూడా స్త్రీలకు హక్కు లేదు. ఈ సూత్రాలను మెలికపెట్టి మిగిలిన ఆస్తికి కూడా వర్తింపచేయవచ్చును. దీనివల్ల స్త్రీలకు ఏమీ ప్రయోజనం లేదు. పైగా ఇందువల్ల హిందూసంఘంలో చాలా దారుణమైన మార్పులు రావచ్చును.

స్త్రీలకు నిజంగా ఆస్తిలో హక్కులు కలిగించాలంటే వివాహం జరగగానే స్త్రీ భర్త ఆస్తికి భాగస్వామిని కావాలి. దేశముఖ్ చట్టానికి కొన్నిమార్పులు చేస్తే ఈ ఏర్పాటు జరుగుతుంది. దీనివల్ల వివాహం కాగానే స్త్రీ, భర్తకుటుంబంలో సంపూర్ణ భాగస్వామిని అవుతుంది. అల్లాగే ఆస్తి అన్యాక్రాంతం చేయడంలోకూడా కొన్ని మార్పులు తీసుకురావాలి. వీటివల్ల స్త్రీకి ఆస్తిలో సంపూర్ణమైన హక్కులు రావాలి. వేదాలు విజ్ఞానేశ్వరాది ధర్మసూత్ర గ్రంథాలు ఈ విషయాన్ని సంపూర్ణంగా బలపరుస్తున్నాయి."

అనంతరం డాక్టరు టేక్‌చంద్ ఏకపత్నీ వివాహానికి సంబంధించిన సూత్రాలతో తాము పూర్తిగా ఏకీభవిస్తున్నామనీ, మద్రాసు, బొంబాయి రాజధానులలో ఇల్లాంటి చట్టాలిదివరకే ఆమోదించారనీ అన్నారు.

దానిపై ఒరిస్సా ప్రతినిధి లక్ష్మీనారాయణసాహూ మాట్లాడుతూ ఏకపత్నీ వివాహచట్టం ఆమోదిస్తె, పురుషులకంటె అధికంగా ఉన్న 3 లక్షల స్త్రీలగతి ఏమి కావాలని అన్నారు. ఈ చలోక్తితో సభ్యులలో హర్షకల్లోలం చెలరేగింది.

అనంతరం బక్షీ టేక్‌చంద్ విడాకులను గురించి మాట్లాడుతూ, సివిలు వివాహ సూత్రాలు శాస్త్రీయ వివాహానికి వర్తింపచెయ్యడం సబబుకాదనీ, విడాకులు శాస్త్రీయ వివాహాలకు వర్తింపజేసేటప్పుడు, మతాంతర ప్రవేశము మొదలయిన ముఖ్యమైన సందర్భాలలో వర్తింపజెయ్యాలనీ, అందుచేత ప్రస్తుతం చట్టంలోని విడాకులకు, వివాహానికి సంబంధించిన సూత్రాలు పూర్తిగా మార్పు చెయ్యాలనీ అన్నారు.

ఆ పిమ్మట చర్చ వాయిదా వెయ్యాలని అనుకున్నా చివరికి ఆనాడే కొనసాగించాలనే నిర్ణయం జరిగింది.

ఆ పిమ్మట తాత్కాలిక సభాధ్యక్షుడు అనంతశయనం అయ్యంగారు లేచి మాట్లాడుతూ, తాము డాక్టర్ అంబేద్కర్ సమాధానానికి సోమవారం ఏర్పాటు చేశామనీ జైనుల పక్షాన్నుంచి ఎవరూ మాట్లాడలేదు. కాబట్టి ప్రొఫెసరు కె. టి. షాను చర్చలో పాల్గొనవలసిందని ఆహ్వానిస్తున్నామనీ అన్నారు.

### కె. టి. షా ఆమోదం

ఆతరువాత ప్రొఫెసరు కె. టి. షా మాట్లాడుతూ, తాము భారత పౌరుడులాగే మాట్లాడుతున్నామనీ, మరి ఒక విధంగా మాట్లాడడం లేదనీ, ఈ చట్టం వాయిదా వెయ్యడం మంచిది కాదనీ దంపతులకు వివాహం బాధాకరంగా ఉన్నప్పుడు వారికి విడాకుల అవకాశం కలిగించడం మంచిదనీ, ఇంక ఆస్తి విషయంలో స్త్రీ పురుషులనుతప్పకుండా సమానంగాచూడాలనీ అన్నారు.

ఆ పిమ్మట ఆయన దత్తతనుగురించి మాట్లాడుతూ, ఇది చాలా అసహజమనీ, అయినా ఇది ప్రాచీన కాలంనించీ వస్తున్నాయి కాబట్టి దీన్ని పూర్తిగా తొలగించి వెయ్యడం మంచిది కావనీ, ఈ చట్టంవల్ల స్త్రీ పురుషులలో ఉండే వ్యత్యాసాలు తొలగిపోగలవనీ అన్నారు.

ఆటు తరవాత సర్దార్ హుకుమ్‌సింగ్ మాట్లాడుతూ, ఈ చట్టంవల్ల గృహజీవితంలోని ప్రేమాదరాలువశించిపోతాయనీ, హిందూ ధర్మ శాస్త్రాలు సిక్కులకు కూడా వర్తించినా, ఈ చట్టం తమ సంఘానికి వర్తించడం తమకు ఇష్టంలేదనీ, పంజాబులో వివాహ విషయంలో కొన్ని ప్రత్యేక ఆచారాలు అమల్లో ఉన్నాయనీ ఆ చట్టంవల్ల వాటికి నష్టం కలుగుతుందనీ, అల్లాగే పెంపకంలో కూడా కొన్ని ప్రత్యేకాచారాలున్నాయనీ, వాటికి ఈ చట్టంవల్ల చాలా ఉపద్రవం కలుగుతుందనీ అన్నారు. అయితే స్త్రీలకు ఆస్తిలో సమానమైన హక్కుండాలన్న సూత్రానికి తాము ఆమోదిస్తున్నామని హుకుమ్‌సింగ్ చెప్పారు.

ఆ పైన మద్రాసు హరిజన ప్రతినిధి, వి. టి. మునిస్వామిపిళ్ళె మాట్లాడుతూ, ఎప్పుడు ఏ సంస్కరణ ప్రవేశపెట్టినా ఎంతో కొంతమంది వాటికి వ్యతిరేకిస్తూనే ఉంటారనీ, ఈ చట్టంవల్ల డాక్టరు అంబేద్కరు కీర్తి ఇనుమడించినదనీ, ఈ చట్టం తాము సంపూర్ణంగా ఆమోదిస్తున్నామనీ అన్నారు.

ఆ పైన మరిఒక మద్రాసు ప్రతినిధి ఒ. వి. అలగేశన్ మాట్లాడుతూ, ప్రజలలో ఈ విషయం బాగా ప్రచారం చేసి వారి అనుమతిపైనే ఇల్లాంటి చట్టాలు ఆమోదించాలనీ, ఇల్లాటి విషయాలలో తొందరపడడం మంచిదికాదనీ, ప్రజలు ఇలాంటి సంస్కరణలకు చాలా వ్యతిరేకిస్తున్నారనీ, విడాకుల చట్టంవల్ల స్త్రీలకే నష్టమనీ, ఏకపత్నీత్వమే మంచిదనీ, అయితే తాము విడాకులకు కూడా అంగీకరిస్తున్నామనీ అన్నారు.

అపిమ్మట అలగేశన్ ఇంకా మాట్లాడుతూ, స్త్రీలకు భర్త ఆస్తిలో హక్కున్నప్పుడే ఆస్తిపక్షంవనీ, తండ్రి ఆస్తితో వాటివల్ల స్త్రీలకు ఉపయోగం ఏమీ లేదని అన్నారు.

అపిమ్మట 6 గంటలకు చర్చ రేపటికి వాయిదా వేశారు.

### మంగళవారంనాటి చర్చ

ఆచార్య కృపాలనీ తాము ఈచట్టానికి ఆమోదం తెలపడానికి కారణాలు చెబుతూ తమకు అభ్యుదయకరమైన అభిప్రాయాలున్నాయనీ అందుచేతనే తాము దీనికి అంగీకరిస్తున్నామనీ, పద్ధతి వేయడానికి తాము సుముఖులు కేననీ, అయితే కేసుపాపెకలు. అంతకంటె పెద్దపద్దాలుగా ఉన్నాయనీ, స్త్రీలకు తప్పకుండా ఆస్తిలో సమానమైన హక్కులుండాలనీ, విడాకుల విషయంలో తనకేమీ అభిప్రాయంలేదనీ, మనదేశంలో యూరోపులో స్త్రీలకు ఎక్కువ గౌరవాలు జరుగుతున్నాయనీ, మనదేశంలో స్త్రీ రాయబారులు, స్త్రీ మంత్రులుకూడా ఉన్నారనీ, అమెరికావంటి దేశాలలో కూడా ఇలాంటి అభ్యుదయం కలగలేదనీ అన్నారు.

తరవాత పండిత గోవిందకాంత మాలవయా మాట్లాడుతూ సభ్యులకు మాట్లాడాలని అనుకున్నంతసేపు అవకాశం ఇవ్వాలని అన్నారు.

[డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు నిన్నటి సమావేశములో బిల్లుపై ప్రజాభిమతం తెలుసుకొనుట అవసరమని ప్రభుత్వమును హెచ్చరించుచు దీర్ఘముగ ఉపన్యసించిరి. వారి ప్రసంగంలోని ఎక్కువ భాగము నిన్నటి పత్రికలో ప్రకటించబడినది. మిగతా దిగువ ప్రచురించడమైనది.]

నేను రాత్రే ఆల్వార్‌నుంచి వచ్చాను. రాగానే విన్నమాట పార్లమెంటు భవనం ముందు ప్రదర్శనాలు జరిగాయని, పోలీసు వారిని తన్నారని ఈబిల్లుయొక్క ప్రభావం ఇది. మీకు పోలీసుల రక్షణలేక మగవాళ్లు, ఆడపోలీసుల రక్షణలేక ఆడవాళ్లు సభకు రాలేకుండా వున్నారు. ఆ రక్షణలేకపోతే, ఈసభలేదు; ఈ బిల్లు లేదు; ఈబిల్లుతో వచ్చే అభివృద్ధిలేదు. ఇటువంటిబిల్లును నిర్వహించవలసిన బాధ్యత డా॥ అంబేద్కర్‌మీద పడ్డందుకు నాకు విచారంగావుంది.

డా॥ అంబేద్కర్: నా కేమీ విచారంలేదు.

డా॥ పట్టాభి: అది నాకు తెలుసు. ఇదివరకు మిమ్మల్ని గురించి చాలాసార్లు వర్ణించి వున్నాను. మంచిగాని చెడ్డగాని, దాన్ని సాధించడంలో మీ అంత వారు లేరు. ఆ శక్తి! మాబోటోళ్లు. కాని ఆయన సమాజానికి ఎప్పుడూ దూరంగావుండే మనిషి. అట్లా అని ఆయన మానవసంఘం అంటే పడదని కాదు. మరి ఆయన మానవుడుకూడా కాదని నాఅభిప్రాయంకాదు, కాని ఆయన పెంపకం, శిక్షణ, పరిసరాలు, పరిశీలనం, సంస్కృతి అన్నీ ఆయన్ని సంఘానికి దూరంగా వుంచాయి. మనలో వున్న ప్రతిభావంతుల్లో ఆయన గూడా ఒక్కరు. అట్లా అని ఆయన చెప్పినదల్లా వేదం కాదు.

నిజానికి ఇటువంటి సంస్కరణలకు ఒక సంఘాన్ని ఏర్పాటుచేసి, వారి ద్వారా ప్రచారించడం మంచిది. ఇట్లా అని నేను బహుసార్లు చెప్పాను. ఇంగ్లండులో గూడా అట్లా జరిగిన అవసరాలు చాలా వున్నాయి.

మంత్రయుక్తంగా వివాహమైనా, దాన్ని రిజిష్టరుచేయించవలసినఅవసరాన్ని నేను హర్షించగలను. అట్లాగే మగపిల్లలకు, ఆడపిల్లలకు ఆస్తి పంపకం విషయాన్ని త్వరలో తేల్చడం మంచిదనే నా అభిప్రాయం. కాని స్త్రీకి గూడా సమాన భాగ స్వామ్యం పెట్టడం వల్ల చాలా ఇబ్బందులు వస్తాయి. కాని ఆడపిల్లకు పెళ్లిఅయిన దగ్గర నుంచి ఆమె భర్త ఆస్తిలో భాగ స్వామ్యం పొందాలని నా అభిప్రాయం అందువల్ల ఆర్థిక పిచ్చి చేష్టలు వేసే అవకాశం వుండదు. విడాకుల విషయంలో యీ నా అభిప్రాయం ఇంకో విధంగా వుంది. మన దేశం నూటికి 90 పెళ్లిళ్లు సుఖాంతాలుగానే కావున్నాయి. మనం పెళ్లి చేసుకుని, ప్రేమిస్తాం. ఇంగ్లీషువాళ్లు ప్రేమించి పెళ్లి చేసుకొని తరువాత ఆ ప్రేమను కాలంతో తెంచారు.

మనం ఈబిల్లును స్పష్టంగా చర్చించడం మంచిది. లేకపోతే దీన్ని గూర్చి ఆలోచించేవాళ్ళు లేరు. ఇప్పుడు మనం ఏ స్థితిలోవున్నామో, దాంట్లోంచే మంచిని సాధించాలి.

అదీకాకుండా ఈ బిల్లును ప్రజాభిమతానికి పెట్టండే లాభంలేదు. అక్కడ గనుక మనం నెగ్గామా, ఇక్కడ మనన్ని కాదనేవాడేలేడు. అందువల్ల దీన్ని ఇంతటితో ఆపుతారనుకుంటున్నాను. కాదు అంటారా? ఎవరిఇష్టంవచ్చినట్లు ఓటు చేసే అధికారం వారికి ఇవ్వండి.

అట్లా చేయని పక్షంలో వచ్చే ఎన్నికల్లో ఇందువల్ల చాలా విషఫలితాలు ఏర్పడతాయి.

త్యాగి: ఎన్నికలు ఇంకో అయిదు సంవత్సరాలు వాయిదా వేస్తేసరి.

డా॥ పట్టాభి: ఇక్కడ మనం ప్రజా సేవకులముగా వచ్చాం. ఆ ప్రజలలో 100కి 90 మంది హిందువులు. నిన్నటి రోజున జరిగిన ప్రదర్శనాలు ఈ బిల్లును గూర్చి అసమ్మతం చేపారపతున్నారు. అది కాంగ్రెస్ పట్ల ప్రజలలో బలిసిన అసంతృప్తిని వెల్లడిచేస్తున్నది. దాన్ని దాచి లాభం లేదు. నేను వట్టి విమర్శకుడులాగా ఇది చెప్పడంలేదు. జీవితమంతా కాంగ్రెసుకు, దేశానికి, అంకితంచేసి, దాని ప్రతినిధిగా ప్రభుత్వాన్ని అనేక విషయాలలో సమర్థించినవాణ్ణిగా చెబుతున్నాను. ప్రభుత్వాన్ని పొగడినంతమాత్రాన అతడు దాని క్షేమాన్ని కోరేవాడు కావడంలేదు. (హర్షం).

1918 నవంబరు 9 వ తేదీనాడు జర్మన్ కెయిజర్ తన సేనానుల నందరిని సమావేశపరిచిన సంగతి అందరికి జ్ఞాపకమే వుండి వుంటుంది. ఆ సేనానులు కెయిజర్‌ను హాలెండుకు పారిపోవలసిందని, 24 గంటలలోగా ఈపని జరిగిపోవాలని ఆయనకు విజ్ఞప్తిచేశారు. కెయిజర్ ఎందుకని అడిగాడు. సైన్యం మీకోసం పోరాడదని వారు ప్రత్యుత్తరం ఇచ్చారు. అట్లా అయితే సైన్యాన్ని, నేనే నడుపుతానని కెయిజర్ ప్రగల్భవచనాలకు దిగాడు. అప్పుడు సేనానులు అన్నారుగదా! నోరు ముయ్యి! 24 గంటలలో తప్పించుకొని

(4 వ పేజీ చూడుడు)

## గంటల పంచాంగం

విరోధి నం॥ మార్గశిర బ॥ ఏకాదశి 1949 నం॥ డిసె॥ 16 శుక్రవారం శు॥ ఏకాదశి ఘ 11 36స్వా రా 11 25వర్జ్యం ఉ 6-33 ల 8-1 కు. తె 4-31 ల 5-59కు.

బ॥ ద్వాదశి డిసె॥ 17 శనివారం శ॥ ద్వాదశి ఉ 8-50(తెల్లవారి) తె 5-58 విశా రా 9-18 వర్జ్యం రా 12-56 ల 2-23 కు.

**ఆంధ్రపత్రిక**

విరోధి నం॥ మార్గశిర బ॥ ఏకాదశి శుక్రవారం

## రాష్ట్ర సరిహద్దులు: అకారణాందోళన

1950 వ సంవత్సరము ఏప్రెల్ 1 వ తేదీనాటికిగాని, ఎవరెన్ని చెప్పినప్పటికిని, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణము సాధ్యముగాదని విభజనసంఘ ప్రథమ సమావేశమునకు పూర్వము ప్రకటించిన చెన్నరాష్ట్ర ప్రధాని మొన్నటి దినము "జనవరి 26 వ తేదీకే ఆంధ్రరాష్ట్ర నిర్మాణము పూర్తి కావలెనని విభజనసంఘము నిర్ణయించెను"ని "ఆ ప్రకారముగ జనవరి 26 న ఆంధ్రరాష్ట్ర అవతరణకు వీలుగ సర్వప్రయత్నములు జరుగుచున్నవ"ని తిరిగి ప్రకటించెను. ప్రభుత్వ సెక్రటేరియట్‌లో విభజనకలాపము ఆంధ్ర రాష్ట్ర స్థాపన తేదీ జనవరి 26 అనుభావముతో విపరీత వేగమున జరుగుచున్నది. ఇతర రాజకీయములు అడ్డుపడకున్న విభజన కార్యక్రమమంతయు జనవరి 26 న ఆంధ్రరాష్ట్రమేర్పడుటకు వీలుగనే పరిసమాప్తము కాగలదని విశ్వసింపవచ్చును.

కాని, విభజన కార్యక్రమము ఈ విధముగ ముగింపుకువచ్చుచుండ, కొందరు తమిళప్రముఖులు చిత్తూరుజిల్లా యందలి కొన్ని ప్రాంతములలోను, కర్నాటక నాయకులు రాయలసీమలోని కొన్ని తాలూకాలందు, ముఖ్యముగ బళ్లారి, అనంతపురముజిల్లాలందు సరిహద్దుల విషయమై ఆందోళన ప్రారంభించి, స్థానిక ప్రజల నుద్రిక్త పరచుచుండిరి. నాయకత్రయ నివేదిక ప్రకారము నూత్నరాష్ట్ర నిర్మాణమునకు ప్రథమావసరము సరిహద్దుల విషయమున సమాధానము. ఆంధ్రరాష్ట్రము విషయమున ప్రస్తుతమునకు సరిహద్దుల విషయమున వివాదములకు ఆస్కారము లేదని, ఖచ్చితముగ ఆంధ్ర ప్రాంతమని తేలిన 11 జిల్లాలు, బళ్లారిజిల్లాలోని మూడుతాలూకాలతో వెంటనే ఆంధ్రరాష్ట్రనిర్మాణముజరుగవచ్చునని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు, ఆంధ్ర, తమిళ కాంగ్రెసు సంఘములు అభిప్రాయపడెను. ఆంధ్ర, తమిళ కాంగ్రెసు సంఘముల తీర్మానము ప్రకారము ఏర్పడు ఆంధ్రరాష్ట్రమున ఆంధ్రేతర ప్రాంతము లుండుటకు అవకాశము లేదు. తమిళకాంగ్రెస్ సంఘము వారు నాయకత్రయ నివేదికను - ఆంధ్రప్రాంతములని నిర్దిష్టముగ నిరూపణ అయిన ప్రాంతములలోనే ప్రస్తుతము ఆంధ్రరాష్ట్ర మేర్పడవలెనని నాయకత్రయ నివేదిక అసందిగ్ధముగ ప్రకటించియుండెను—నిర్నిబంధముగ ఆమోదించి "చిత్తూరు, కడప, కర్నూలు, బళ్లారి, అనంతపురము, నెల్లూరు, గుంటూరు, కృష్ణా, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, దక్షిణ, ఉత్తర విశాఖపట్నము జిల్లాలతో ఆంధ్ర రాష్ట్రమును ఏర్పాటుచేయవలెన"ని తీర్మానించియుండెను. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘము మాత్రము బళ్లారి జిల్లాలోని మూడు తాలూకాలను మాత్రమే కోరియున్నది. ఈ 11 జిల్లాలు, మూడు తాలూకాల వెలుపల, వీటి సంశ్లిష్ట ప్రాంతములందు ఆంధ్రులు అధికసంఖ్యాకులుగ నున్నప్పటికిని, రాష్ట్రకాంగ్రెసు సంఘము ఆ ప్రాంతములను ఆంధ్రలో చేర్చమని కోరియుండలేదు. ఆ ప్రాంతమునందలి ఆంధ్రులు కూడ రాష్ట్రకాంగ్రెసు తీర్మానమును గౌరవించి, తమ ప్రాంతములు తత్క్షణము ఆంధ్రలో చేర్చవలెనను ఆందోళనను విరమించిరి.

కొందరు తమిళనాయకులు మాత్రము చిత్తూరుజిల్లాయందు తమిళకాంగ్రెసుసంఘ తీర్మానమునకు విరుద్ధముగ, సరిహద్దుసంఘములని స్థాపించి, చిత్తూరుజిల్లాలోని అధికభాగము తమిళరాష్ట్రమున చేర్చవలెనని ప్రారంభించి, ఆ ప్రాంతమునందు శాంతిభద్రతలకు భంగము కల్గించుచుండిరి. ఆ ప్రాంతమునందలి ఆంధ్రనాయకులు అత్యంత ఓర్పువహించి సాత్వికమార్గముననే తమిళనాయకుల ప్రచారాందోళనములను ఎదుర్కొనుచున్నను పరిస్థితులు నానాటికి విషమించుచున్నవి. విభజనసంఘము సకాలమునందే యావత్తు కార్యక్రమమును పూర్తిచేసినను, సరిహద్దు విషయమున నిర్హేతుకముగ, నిరాధారముగ తమిళులు, కర్నాటకులు ప్రారంభించిన ఆందోళన ఫలితముగ సరిహద్దుల నిరూపణ కార్యక్రమమునకు విఘ్నములు కలిగి జనవరి 26 న ఆంధ్రరాష్ట్రఅవతరణకు ఆటంకములు ఏర్పడవచ్చును.

స్థూలముగ, అన్ని పక్షముల సమ్మతిపై రాష్ట్రసరిహద్దులు నిర్ణయమైనవిగనుక ఆ ప్రకారము గవర్నరుజనరల్ ఉత్తరువునందు రాష్ట్ర సరిహద్దులను పేర్కొనవచ్చును. వాస్తవమునకు సరిహద్దు నిరూపణ ఉత్తరువు అయిన అనంతరము జరుగుటే క్రమమైన పద్ధతి. చెన్నరాష్ట్ర ప్రభుత్వముగాని, కేంద్ర ప్రభుత్వముగాని ఈ "ప్రవాసనాయకుల" నిర్హేతుకము, ఆధారరహితము అయిన ఆందోళనను పాటింపక రాష్ట్ర సరిహద్దుల నిరూపణచేయవలసియున్నది. సరిహద్దుల మార్పునకు ముందు ముందు అవకాశము గలదని నాయకత్రయ నివేదిక స్పష్టం చేసియుండెను. గనుక ఈ తమిళ, కర్నాటకనాయకులు తమ శక్తి సామర్థ్యములను అకాలములో వృథాచేసుకొనుటకంటె సకాలమునకు అక్కరకు వచ్చునట్లు పొదుపు చేసుకొనుట మంచిది. ప్రస్తుతాందోళనవలన వారికి ఎట్టి ప్రయోజనము ఉండకపోవుటేగాక, తమ ఇరుగుపొరుగు వారితో విరోధముపెట్టుకొనిసౌఖ్య జీవనమునకు, సఖ్యతాభివృద్ధికి గల కొద్ది యవకాశములను జారవిడచినవారగుదురు.

### గోదావరి వంతెన

పెన్నా, కృష్ణా, గోదావరీ నదులపై రహదారి వంతెనలు నిర్మించిన చెన్నపట్టణము-కలకత్తా నగరములకు సరాసరి భూమార్గ మేర్పడి, అన్ని ఋతువులలో అన్ని వేళల రాకపోకలు సులభము అగుటయేగాక సరుకుల రవాణా విషయమున ప్రస్తుతమున్న అనేక ఇబ్బందులు తొలగిపోగలవు. అత్యవసర వస్తువులను మాత్రమేరైల్వేలద్వారా రవాణా చేయుచు ఇతర సరుకులను యానత్తుభూమార్గమునను రవాణా చేయుచు రైల్వేల భారమును చాలవరకు తగ్గింపవీలగును. ఒకప్పుడు రైల్వేబోర్డువారు, ఇట్టి రవాణా సౌకర్యముల అభివృద్ధి వలన రైల్వేల ఆదాయము తగ్గిపోవునని భావించి రాచబాటల యభివృద్ధి కార్యక్రమములతో అంతగ సహకరింపలేదు. కాని పరిస్థితులు, వాటి ననుసరించి అవసరములు మార్పు చెందుటతో రాచబాటల అభివృద్ధి విషయమై కేంద్రప్రభుత్వము రైల్వేబోర్డు కూడ తమ పూర్వపైఖరిని మార్చుకొనుట తప్పనిసరి అయినది. వైఖరిమార్పు ఫలితమే ఆలమూరువద్ద గోదావరిపై వంతెన నిర్మాణము, బీహారులో గంగా నదిపై వంతెన నిర్మింపసంకల్పము.

మొన్న బుధవారము ఆలమూరువద్ద గోదావరిపై వంతెనకు కళావెంకట్రావుగారు, శంకుస్థాపన చేసిన సందర్భమున చెన్నరాష్ట్ర రాచబాటల ప్రధాన ఇంజనీరు శ్రీ యం. యస్. తిరుమల అయ్యంగార్ వారధి నిర్మాణము నందలి సాధకబాధకములను వివరించుటతోబాటు రాజమహేంద్రవరమువద్ద రైల్వేవంతెన సమీపమున గాక ఆలమూరువద్ద నిర్మించుటలో ప్రజలకు సమకూరువిశేష ప్రయోజనమునుకూడ వెల్లడించిరి. ఈ వంతెన ప్రభుత్వ ఇంజనీర్లు నిర్ణయించిన ప్రదేశములో నిర్మించుటకె ఎక్కువ ఉపయోగకరమని తిరుమల అయ్యంగారి వివరణవలన స్పష్టమైనది. ఇందువలన నిర్మాణ ఖర్చులు హెచ్చినను, నిర్మాణములో కొన్ని క్రొత్తసమస్యలు ఏర్పడినను ప్రజలకు కలుగు బహుళ ప్రయోజనములను మనస్సునందుంచుకొని వీటినన్నింటిని అధిగమించుటకు ప్రయత్నములు జరుగవలసి యుండును. రాష్ట్రప్రభుత్వము ఈదృష్టితోనే వంతెన నిర్మాణ స్థలమును నిర్ణయించుట ప్రశంసనీయము.

ఇదే విధముగ సాధ్యమైనంత త్వరలో కృష్ణా, పెన్నారునదులపై కూడ రహదారివంతెనల నిర్మాణమునకు కేంద్ర ప్రభుత్వము దోహదము చేయవలసియున్నది. ఈ రెండువంతెనలుకూడ ప్రభుత్వామోదమును పొందియున్నవి. ప్రథమమున కృష్ణానదిపై వంతెన నిర్మాణమే జరుగునని భావింపబడెను. ఏ కారణము వలననో అది వెనుకబడి, బడ్జెట్‌లో ప్రభుత్వ అభిమతమునకు సూచనగ గ్రాంటు ప్రత్యేకింపబడియు, గోదావరి వంతెన ముందు ప్రారంభమైనది. కృష్ణ, పెన్న వంతెనల కంటె గోదావరివంతెన ఎక్కువ వ్యయప్రయాసలతో కూడుకొనియున్నందున ముందు ఆ వంతెనను పూర్తి చేయుట అవసరమని ప్రభుత్వము భావించి యుండవచ్చును. కాని మిగత రెండువంతెనలు నిర్మాణముకూడ పూర్తిఅయినగాని ఈ రాష్ట్రమునకు సంబంధించినంతవరకు రాచబాటల అభివృద్ధి ఒక దశకు రాజాలదు.

### ప్లీడర్లు అడ్వకేట్లుగా నమోదు అగుట

చెన్నపట్నం, డిశంబరు 15: మదరాసు హైకోర్టులో యీవాళ మరి 86 మంది ప్లీడర్లు అడ్వకేట్లుగా ప్రధాన న్యాయమూర్తి శ్రీరాజమన్నార్, న్యా॥ కృష్ణస్వామినాయుడుగార్ల ఎదుట నమోదు అయినారు.

## విజయవాడ 'కార్పొరేషన్' ఏర్పాటుకు తక్షణ చర్యలు తీసుకోవాలి

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు కేంద్రము విజయవాడలో నుండుటకు వీలులేదని పట్టుబట్టి విశాఖపట్టణమునకు మార్పించిన డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారు విశ్వకళాపరిషత్తు ఉపాధ్యక్షపదవినుండివిరమించుకొనినతర్వాత విజయవాడపై వారికి ప్రత్యేకాభిమానము కలిగినందుకు విజయవాడపౌరులేగాక ఆంధ్రులు అందరుసంతోషింతురు. ఆంధ్ర రాష్ట్ర మేర్పడనున్న తరుణములో రాజధాని, హైకోర్టు ఎక్కడ ఏర్పడవలెనను విషయమై ప్రతి ఒక్కరు తమ గ్రామాభిమానమును ప్రదర్శించుచుండగా, డాక్టర్ రామలింగా రెడ్డిగారు విజయవాడలో ఆంధ్ర ప్రభుత్వ కార్యస్థానమును ఏర్పాటు చేయవలెనని, హైకోర్టుకు అవసరమైన కొన్ని కార్యస్థానములను రాయలసీమ యందొకచోటను ఏర్పరచుట యుక్తమని ఉద్బోధించి వెనుక విజయవాడకు చేసిన అపచారమునకు ఒకవిధముగ పశ్చాత్తాపమును ప్రకటించిరి. విజయవాడకేవలమురైల్వేజంక్షనుమాత్రమే గాదు యావదాంధ్రమునకు, తెలంగాణాతో సహా, కేంద్రముగనున్నది. విజయవాడ చరిత్ర ప్రసిద్ధమని శ్రీ భావరాజు వెంకటకృష్ణరావుగారు నిరూపించిరి. తిరుపతివెంకటేశ్వరునకు ఎంతమహిమగలదో శ్రీ కనకదుర్గకు అంత మహిమగలదు. ఇదిఇలా ఉండగా విజయవాడ ఆంధ్ర రాజధాని అయితే అన్ని ప్రాంతాలవారికీ అందుబాటులో ఉంటుంది. ప్రభుత్వానికి అవసరమైన రేడియో కేంద్రం సిద్ధంగా ఉంది. ప్రభుత్వ భవనాల నిర్మాణానికి ఎటు జిల్లినా కావాల్సినంత స్థలం ఉంది. విజయవాడ అర్హతలను గురించి మరొకప్పుడు వివరిస్తాను అలాంటివివరణ అవసరమేఅయితే.

ముఖ్యంగా ఇప్పుడు నేను విభజన సంఘంవారిని, చెన్నరాష్ట్ర ప్రభుత్వాన్నీ కోరేదేమంటే తాత్కాలికాంధ్ర రాజధాని విజయవాడ అని విభజనసంఘం వారు తీర్మానించవలెను. ఆ తీర్మానాన్ని చెన్నరాష్ట్ర ప్రభుత్వం అమలుజరుపవలెను. అందుకు ప్రాతిపదిక చర్యగా విజయవాడ మునిసిపాలిటీని కార్పొరేషన్‌గా మారుస్తూ చెన్నరాష్ట్ర స్థానిక స్వపరిపాలన మంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు రాబోయే రాష్ట్ర అసెంబ్లీలో ఒక బిలును ప్రతిపాదించాలి. ప్రస్తుతం విజయవాడ జనాభా దాదాపు లక్షన్నర ఉంటుంది. 'విశాల విజయవాడ' నిర్మాణకలాపాన్ని అనుసరించి ఇప్పటి పుర పరిహద్దులను విస్తరింపచేయాలి. ఇది అంత కష్టమైన పనిగాదు. ఇందుకు పట్టణమును అనుకొనియున్న సివార్ల ప్రజలు ఎట్టి అభ్యంతరమూ చెప్పరు. ఈవిధంగా విస్తీర్ణం పెరిగి, ఆదాయాభివృద్ధి అయితే కార్పొరేషన్ హోదాకు అన్నివిధాలా విజయవాడ అర్హతపొందగలదు. గౌరవనీయులు శ్రీ చంద్రమౌళిగారు ఈ కార్యక్రమమును నిర్వహించిన తమహాయములో ఆంధ్రుల లోక మహానగరమును ప్రసాదించిరన్న ఖ్యాతిని పొందగలరు. విజయవాడ పురపాలకసంఘంవారూ ఈ పరిణామాన్ని సాధించడానికి తగిన కృషి చేయుదురని ఆశించుచున్నాను.

దాదాపు 20 సంవత్సరముల క్రితము సైమిక కమిషన్‌వారు మనదేశం వచ్చి ఈ రాష్ట్రంలో పర్యటించు సందర్భాన గుంటూరురాగా, అప్పుడు గుంటూరు వీధుల్లో ఏర్పాటైన ఆర్చిలపైన "గుంటూరుకార్పొరేషను హోదాను కోరుతున్నది." అని వ్రాసి కమిషన్‌వారికి పౌరులు తమ అభిమతాన్ని తెలుపుకున్నారు. గుంటూరు కార్పొరేషను కాగల అర్హతను పొందితే విజయవాడకు అర్హతలేదని ఎవరనగలరు? ఈ 20 సంవత్సరాల్లో రెండు నగరములూ ఎంతగానో అభివృద్ధి చెందినవి. రెండూ ఆంధ్ర వ్యాపారానికి కేంద్రాలు. అయితే విజయవాడకు మరొక అర్హత కూడా ఉంది సరుకుల ఎగుమతి, దిగుమతులకు అన్ని విధాలా చాలా అనుకూలమైన పట్నం. నీటి సమస్య ఒకటి ఉండదు. ఎటువచ్చీ ఒకఎండ తీవ్రత. భారతరాజధాని ఢిల్లీలో ఒక్క వేసంగి ఉంటే ఇంతకంటే మన విజయవాడ నయం అనేభావం కలుగుతుంది

రామలింగారెడ్డిగారే విజయవాడ రాజధాని కావడానికి సుముఖంగా ఉన్నారు. గనుక మన తాత్కాలిక రాజధాని విజయవాడ తథ్యం. రాష్ట్ర రాజధాని హోదాకు తగట్టుగా విజయవాడను సత్వరంగా కార్పొరేషన్ చేయడం అవసరం.

ఈ బాధ్యత పురపాలకసంఘంవారిపైనా, స్థానిక స్వపరిపాలనా మంత్రిగారిపైనా ఉంది. వీరిరువురు తమ బాధ్యతలను సకాలంలో నిర్వహింపగలరనే విశ్వసిస్తున్నాను. —ఒక ఆంధ్రుడు,

## మండలిలో కాశ్మీర్ సమస్యపై చర్చకు సన్నాహాలు
### 17-వ తేదీన నివేదిక ప్రతిపాదన

లేక్‌సక్సెస్, డిసెంబరు 14: కాశ్మీర్ మధ్యవర్తిసంఘ నివేదికపై చర్చ జరపటానికై భద్రతామండలి 17 వ తేదీ శనివారం నాడు సమావేశమవుతున్నది. మధ్యవర్తి సంఘాధ్యక్షుడూ, కొలంబియా ప్రతినిధీ అయిన సీసార్ హెర్నాండో కాంపర్ నివేదికను ప్రతిపాదిస్తూ ఒక ప్రసంగం చేయటంతో చర్చ ప్రారంభమవుతుంది.

చర్చలో భారతప్రతినిధివర్గానికి నాయకత్వం వహించటానికి ఇక్కడికివచ్చిన సర్ గిరిజాశంకర్ బాజ్పాయ్, వచ్చిన మరుక్షణంనుంచీ ముఖ్యసంప్రదింపులను జరపటంలో నిమగ్నుడైనాడు.

భద్రతామండలి సభ్యుల్లో కొందరు ముఖ్యులనూ, సమితి అధికార ప్రముఖులను కొందరినీ, అమెరికన్ ప్రభుత్వ ముఖ్యులనూ ఆయన కలుసుకున్నాడు. ఈ వేళ ఉదయం ఆయన సమితిలో భారత శాశ్వత ప్రతినిధి సర్ బి. ఎన్. రావ్‌తో సంప్రదింపులు జరిపాడు.

చర్చ శనివారంనాడే ప్రారంభం అవుతున్నది కనుక ఇండియా, పాకిస్థాన్ ప్రతినిధివర్గాలు రెంటిలోనూ తీవ్రమైన సంచలనం కనిపిస్తున్నది. మధ్యవర్తి సంఘం చర్చలో తన అభిప్రాయాన్ని స్వయంగా ప్రకటించేలోపుగా ఆ ఉభయుల్లో ఎవ్వరూ మధ్యవర్తిసంఘ నివేదికమీద వ్యాఖ్యానించేట్లు కనిపించటంలేదు.

### "యథాతథపు ఒడంబడిక" పట్ల ఆసక్తి

ఇదివరకు కాశ్మీర్ సమస్యపై జరిగిన చర్చలకూ ఇప్పటికీ ఒక భేదం కనిపిస్తున్నది. పాకిస్థాన్ కాశ్మీర్‌తో చేసుకున్నట్లు చెప్పబడే 'యథాతథపు ఒడంబడిక' ఏమిటో చూడాలన్న ఆసక్తి మాత్రం ఎక్కువగా సమితి వర్గాల్లో కనిపిస్తున్నది. ఆ ఒడంబడిక అన్వయాన్ని గురించి వచ్చే వాదప్రతివాదాల విషయమై ఇప్పుడు ఆసక్తి కనపడటంలేదు.

### కాశ్మీర్ ప్రతినిధులు

కాశ్మీర్ విదేశాంగశాఖా సహాయ మంత్రి డి. దార్ ఇప్పుడిక్కడే వున్నాడు. రేపు తమ ప్రధాని అబ్దుల్లాకోసం ఎదురుచూస్తున్నాననీ, అంతవరకూ మధ్యవర్తిసంఘ సిఫార్సులమీద వ్యాఖ్యానించననీ అతడు తెలియజేశాడు. కాశ్మీర్ సమస్యపై భద్రతామండలి మొదటిసారి చర్చించినప్పుడు షేక్ అబ్దుల్లా చేసిన ప్రకటనను మధ్యవర్తిసంఘ నివేదిక పూర్తిగా సమర్థించినదనిమాత్రం అతడు అన్నాడు.

"పాకిస్థాన్ కాశ్మీర్‌పై దండెత్తిన వారికి సాయపడి దురాక్రమణదారైనదని షేక్ అబ్దుల్లా చెప్పగా భద్రతామండలి అప్పుడు దానిని పాటించలేదు. కాని ఆ తరువాత మధ్యవర్తి సంఘమే అనేకసార్లు, తాను ఊహించని క్రొత్త పరిస్థితులు, కాశ్మీర్‌లో పాకిస్థాన్ సేనల ఉనికివల్ల తమ నెదుర్కొంటున్నవని విస్పష్టంగా ప్రకటించింది. అజాద్ కాశ్మీర్ సేనలను కట్టుబెట్టాలులేని దోపిడిదారుల మూకగా పరిగణించకూడదు. కాశ్మీర్ ప్రజలు తమ భవిష్యత్తును నిర్ణయించుకొనటానికి జనవాక్యాన్ని నిర్వహించాలంటే ఆ సేనలను నిరాయుధంచేసి రద్దుచేయక తప్పదు.

### దురాక్రమణదారుని ప్రకటించాలి

దురాక్రమణదారు లెవరో కనుగొన్న వెంటనే అతడిపేరుని ప్రకటించాలి. అంతేకాని ఇష్టం లేకుండా పనులు చేయటం చేసిన నిర్ణయాల తీవ్రతను తగ్గించి మెత్తబెట్టేట్లు చేయాలని ప్రయత్నించటం అన్నది దురాక్రమణదారుణ్ణి బతిమాలుకుని అనుసయ పరచటమే అవుతుంది. దురాక్రమణదారుణ్ణి అనునయించటమన్నది శాంతిని భగ్నం చేస్తుందని ఇటీవలి ప్రపంచ చరిత్ర నిరూపించింది." అని దార్ ఒక హెచ్చరిక చేశాడు.

### షేక్ అబ్దుల్లా లండన్‌లో దిగగానే

లండను, డిసెంబరు 15: నిన్న అపరాహ్ణం షేక్ అబ్దుల్లా విమానం లండను విమానకేంద్రంలో వాలగానే ఒక మోటారుకారు అతి వేగంగా విమానం వద్దకు వచ్చి షేక్ అబ్దుల్లాను ఎక్కించుకొని, మామూలు కర్మకాండ ఏమీ లేకుండా, నేరుగా లండనుకు వెళ్లిపోయింది. ఈ విషయమై ప్రశ్నించగా విమానసంస్థకు చెందిన ఒక ఉద్యోగి, "ఆయన క్షేమంగా అమెరికా చేరాలి," అన్నాడు. దీనినిబట్టి షేక్ అబ్దుల్లా ప్రాణానికేదో అపాయం ఉండి ఉండాలనే వదంతి పాక్కింది.

ఈ వదంతిని ఖండిస్తూ ఇండియా భవనానికి చెందిన ఒక భారతీయుడు, షేక్ అబ్దుల్లా ప్రాణాని కెట్టి భయమూలేదనీ, ఆయన హోటలులో ఉన్నాడనీ, అనుకొన్న ప్రకారం లేక్‌సక్సెస్ చేరుకొంటాడనీ చెప్పాడు. (గ్లోబ్.)

## హేగ్ ఒప్పందానికి ఇండొనీషియా రిపబ్లికన్ పార్లమెంటు ఆమోదం

బటేవియా, డిశంబరు 14: ఇండొనీషియన్ రిపబ్లికన్ పార్లమెంటు నేడు హేగ్ ఒడంబడికను ఆమోదించింది.

ఒడంబడికకు అనుకూలంగా 226 ఓట్లున్నూ వ్యతిరేకంగా, 2 ఓట్లున్నూ వచ్చాయి.

కమ్యూనిస్టులు, కొంతమంది సోషలిస్టులు ఒడంబడికకు వ్యతిరేకంగా ఓటుచేశారు.

కొంతమంది సోషలిస్టులు ఓటింగులో పాల్గొనకుండా సభలోంచి లేచిపోయారు. రిపబ్లికన్ పార్లమెంటరీ పద్ధతిలో తటస్థంగా వుండే సావకాశంలేదు. అందువల్ల ఎటూ ఓటుచేయకుండావుండిపోదామను కున్నవాళ్లకు లేచిపోవడంకన్నా గత్యంతరం లేకపోయింది.

అందువల్ల దాదాపు 30 మంది సోషలిస్టులు ఓటింగు సమయంలోసభ విడిచివెళ్లిపోయారు.

వీరిలో చాలామంది సుల్తాన్ షరియార్ పార్టీకి చెందినవాళ్లు. షరియార్ స్వయంగా పార్లమెంటులో సభ్యుడుకాని కారణంగా ఆయన దీనికి హాజరుకాలేదు. ఇప్పుడుఆయనజోగ్జకార్తాలోకూడాలేరు.

సభను విడిపోవడానికి ముందు మాట్లాడుతూ, హేగ్‌లో ఒడంబడికలు కుదుర్చుకోవడం మాకెంతమాత్రం ఇష్టంలేదు ఈ విషయంలో ప్రభుత్వవిధానం మాకు నచ్చలేదు. అందువల్ల ఈ ఒడంబడిక బాధ్యతలనుకూడా మేము వహించదలచుకోలేదు అని సోషలిస్టుపార్టీ నాయకుడు అన్నాడు.

హేగ్ ఒడంబడికను అంగీకరించే నిమిత్తం రిపబ్లికన్ పార్లమెంటు జోగ్జకార్తా సుల్తాను దర్బార్ భవనంలో సమావేశమైనారు. దాన్ని క్రాటన్ అని పిలుస్తారు. ఇది చాలా పురాతనమైన కట్టడం.

ఈ ఒడంబడికను అంగీకరించిన కారణంగా రిపబ్లికన్ ప్రభుత్వం ఇంతకాలంగా డచ్చివారితో సుబుగుతున్న పోరాటాన్ని విరమించి, జాతికోసం డచ్చివారితో కలిసి పనిచేయడానికి ఒప్పుకోవడం జరిగింది.

నేడు పార్లమెంటులో మాట్లాడుతూ ఇండొనీషియా ప్రధాని డా॥ హట్టా ఈలా అన్నారు: సహాయ నిరాకరణంగాని, సంప్రదింపులపట్లనైముఖ్యంగాని ఇక పనకు ఎంతమాత్రం మంచిదికాదని రూఢి అయిపోయింది. అందువల్ల మన భవితవ్యం అందానూడా చెడిపోతుంది. అటువంటి విధానంవల్ల ప్రజలకుస్వాతంత్ర్యం దక్కడానికి ఆలస్యం అవుతుందేగాని ఇంకా ఏమిజరగదు.

ఇండొనీషియాలో వున్న 16 ప్రత్యేక రాష్ట్రాలవారున్నూ ఈ ఒడంబడికను ఆమోదించారు. ఒక్క న్యూగినీ విషయం ఇంకా ఎటూ తేలలేదు. అందువల్ల న్యూగినీని విడిచి తక్కిన తూర్పు ఇండియా దీవులన్నింటిని కలిపి, ఇండొనీషియా సంయుక్త రాష్ట్రాలుగా ఏర్పాటు చేయడానికి ఏర్పాట్లు జరుగుతాయి.

ఇండొనీషియా సంయుక్త రాష్ట్రాలపట్ల అనువర్తనీయం అయ్యే తాత్కాలిక రాజ్యాంగంమీదకూడా నేడు సంతకాలు జరిగాయి

జోగ్జకార్తాలో రిపబ్లికన్ పార్లమెంటు హేగ్ ఒడంబడికను ఆమోదించిన అనంతరం ఈ కార్యక్రమం నడిచింది.

బటేవియాలో డా॥ సోకర్నో గృహంలో ఈ సంతకాలు జరిగాయి.

జాతీయసన్నాహ సంఘాధ్యక్షులు డా॥ రోయం దీనిమీద ఇండొనీషియా తరఫున సంతకం చేశారు. ఈసందర్భంలో తక్కిన 16 రాష్ట్రాల ప్రతినిధులు అక్కడే వున్నారు.

జోగ్జకార్తాలో పార్లమెంటు హేగ్ ఒడంబడికను ఆమోదించిన మరుక్షణంలోనే డా॥ రోయం ఆ తార్తను అంద్యద చేసారు. ఆతరువాతనే ఆయన ఆరాజ్యాంగంమీద సంతకం చేసారు.

ప్రస్తుతం తాత్కాలికంగా ఆమోదించిన ఈ రాజ్యాంగం సమగ్రమైనది కాకపోయినా ఒక సంవత్సర కాలంపాటు పని చేయడానికి అన్నివిధాల పనికివస్తుందని సంతకాలు పూర్తి అయిన అనంతరం డా॥ రోయం వెల్లడి చేసారు.

ఈ సంవత్సరంలోగా ఎన్నికలు జరిపి, రాజ్యాంగాన్ని నిర్మించే నిమిత్తం రాజ్యాంగ పరిషత్తు ఒకదాన్ని ఏర్పాటు చేయవలసివుంటుందని కూడా ఆయన స్పష్టంచేసారు.

## ఆంధ్రరాష్ట్ర ఆర్థికస్థితి: కేంద్రప్రభుత్వాదేశం

(1-వ పేజి తరువాయి)

ప్రధాని తెలిపిరి. విభజన కార్యక్రమము మందంగా నడవవలెనని ఇండియా ప్రభుత్వము సూచించినట్లు భావించవచ్చునా యని అడగ్గా అట్లు భావించుట సబబు కాదని ప్రధాని అనిరి. ఇండియా ప్రభుత్వము నూతన ఆంధ్ర రాష్ట్రం ఆర్థికంగా ఎట్లా ఉంటేది, లోటు ఎంత ఉంటుందీ యింకా తత్సంబంధముగా ఎదుర్కొనవలసిన సమస్యలను తెలుసుకొన వాంఛించుచున్నది. భార్గవ కమిషన్ నివేదికననుసరించి ఆంధ్రరాష్ట్రమునకు $6\frac{1}{2}$ కోట్ల రూపాయలు లోటు అంచనా వేయబడినదనియు అయితేయిటీవల ఆర్థిక మంత్రి అసెంబ్లీకి అందజేసిన లెక్కల ననుసరించి పై అంచనా పొరపాటుగా తేలిందనీ తాజా లెక్కలను అనుసరించి సుమారు $1\frac{1}{2}$ కోట్లు లోటు ఉండునదనియు అదికూడా యిన్కంటాక్సు పాగాకు పన్నులకు లెక్కతీసుకోకుండానే అనిరి. ఈ విషయమన్నిటిని వివరంగా ఇండియా ప్రభుత్వమునకు తెలియ చేయవలసి యున్నదని ప్రధాని ఇండియా ప్రభుత్వపు లేఖ ఉద్దేశ్యము వివరించుచూ తెలిపిరి. సరిహద్దుల విషయమై మాట్లాడుచూ చిత్తూరు చెంగల్పట్టు జిల్లాల సరిహద్దుల విషయంలో విభజన సంఘం ఒక అంగీకారమునకు వచ్చినా కన్నడుల తోసం బంధమున్న బళ్ళారి విషయంలోనైనా సరిహద్దు సంఘం రాక తప్పదని ప్రధాని అనిరి. సిబ్బంది పంపిణీవిషయం మాట్లాడుచూ అనుభవం గలఉద్యోగులు ఆంధ్రరాష్ట్రమునకుకూడా వెళ్లవచ్చుననియు ఆంధ్రరాష్ట్రం సమష్టి మదరాసు రాష్ట్రంనుండే ఏర్పడుచున్నది గనుక మామూలుగా బదిలీ అయినట్లుగనే భావించుకొని వచ్చుననియు అందువలన ఉద్యోగులేమీ భయపడ పనిలేదని ప్రధాని తెలిపిరి. విభజనసంఘంవారి సూచనలు ఇండియా ప్రభుత్వమువారి యిటీవలిలేఖను మదరాసు మంత్రివర్గము డిశంబరు 24-వ తేదీ జరుగు సమావేశంలో సమగ్రముగా పరిశీలించగలదని ప్రధాని తెలిపిరి.

## హిందూస్మృతిబిల్లుపై వాదోపవాదాలు

(8వ పేజి తరువాయి)

నిన్ను నవ్వు కాపాడుకో అని మందలించాను.

అట్లా నిజం చెపితే నిష్ఠురంగా వుంటుంది. అయితే దాన్ని వినకతప్పదు. అందువల్లనే నేను పరిస్థితిని ఇంకోసారి పరిశీలించండి అని ప్రార్థిస్తున్నాను (దీర్ఘహర్షం)

ఆచార్య కృపలానీ బిల్లును సమర్థిలగ ప్రస్తుతం ప్రభుత్వం పదవిలోంచి తొలగడం తనకిష్టంలేదు గాబట్టి బిల్లుకు బలపరుస్తున్నానన్నారు. ప్రభుత్వం రాజీనామా ఇస్తే, ఇంతకన్నా మంచి విషయంమీద ఇవ్వాలి. పంచదార కొరతకంవుంది. అది లేకపోవడంచేత చాలామంది పిల్లలకుపాలు గూడా పోసగనంలేదు. అందువల్ల ఆ తల్లులు, ఆ తండ్రులు, ఎక్కువధరలు పెట్టి కొనవలసివస్తున్నది. ఇటువంటి సమస్యమీద ప్రభుత్వం రాజీనామా ఇస్తే ఆం తాసంతోషిస్తారు అని ఆయన అన్నారు.

ఒక సభ్యుడు:-పంచదారకంటే, ఇది ముఖ్యమైన సమస్య.

ఆచార్యకృపలానీ:-అయినా ఇది పంచదార అంత తియ్యగా వుండదు. హిందూమతానికి దురవస్థ పట్టతోందని నేను దీన్ని సమర్థించడంలేదు. నా ఇంటి కోసం రాకుండావుంటేందుకు సమర్థిస్తున్నాను. మా ఆవిడ నన్ను మహాబలవంతపెట్టింది.కాబట్టి బలపరుస్తున్నాను. అంతేగాని, దొంగలు, దుర్మార్గులు, లంచాలు, బ్లాక్‌మార్కెటీర్లు, లంచగొండ్లు, విచ్చలవిడిగా తిరుగుతూవుంటే లేని ఆపద మతానికి ఇందువల్ల రాబోవడంలేదు.

# కృష్ణాజిల్లాలో తుపాను బాధితులకు సహాయం

## జిల్లా కలెక్టరుగారి వివరణ

బందరు, డిశంబరు 18: కృష్ణా జిల్లా కలెక్టరు జె. పాశెగారు నిన్న సాయంకాలము తమ బంగాళాలో జిల్లాలోని పత్రికా విలేఖరులతో ఇష్టాగోష్టి సభ జర్పిరి. విలేఖరుల ప్రశ్నలకు జవాబు చెప్పుతూ, యింతవరకు జిల్లాలో తుపాను వల్ల నష్టపడినవారికి రూ 515000/- లను సహాయంగా పంచిపెట్ట బడినదనియు, రు 65328/- ల తుపాను నిధి వసూళ్లుజర్గినవనియు చెప్పిరి. రాష్ట్రీ తుపాను సహాయనిధి సంఘంవారు కొంత ద్రవ్యమొసగెదరనియు అది రావడంతోనే ఆ సొమ్మును బాధితులకు పంచిపెట్టడ మగుననియు అన్నారు. రెండవ వరిపంట సాగుకు, కిందటి సంవత్సరములో ఎంత విస్తీర్ణానికి నీరుసప్లయి చేయబడినదో అంత విస్తీర్ణమునకు మాత్రమే ప్రస్తుతము నీరివ్వగలమని యు చెప్పిరి. తుపానువల్ల నష్టపడిన ప్రాంతాల్లో వరిపైరు అజమాయిషీ చేయబడుచున్నదనియు, ఈ విషయం తేలేంతవరకు అనగా ధాన్యపురాబడి అంచనా తేలేటంతవరకూ జిల్లాబైటకు బియ్యం రవాణా సాగదని చెప్పిరి. పంచదార వినియోగదార్లందరకు అందుబాటులో లేనికారణమున, హోటళ్ళు, మిఠాయి అంగళ్ళకు పంచదార సప్లయి ఆపుచేయు విషయం ఆలోచించబడునని చెప్పిరి. ఈ సంవత్సరము ధాన్యంధరలను ప్రభుత్వము నిర్ణయించినప్పటికి, గత సంవత్సరము యిచ్చిన ధరలనే మిల్లులవారు యిస్తున్నారనీ ధాన్యంపొట్టు అనగా ఊకతీసిన బియ్యాన్ని ప్రజలకు మిల్లులు సప్లయిచేస్తున్నారనీ విలేఖరులు తెలియజేయగా విచారించెదనని కలెక్టరుగారు జవాబిచ్చిరి. మంత్రుల పర్యటన కార్యక్రమములను విలేఖరులకు అందజేసెదమనీ కాని విలేఖరులకు జీపుకారులు సప్లయిచేయుటకు వీలుకాదనీ చెప్పిరి. (స్వ. వి.)

## కృష్ణా జిల్లాలో ఆహారస్థితి

### ఆహారసంఘ సమావేశంలో సప్లయిశాఖాధికారి వివరణ

బందరు, డిశంబరు 13: కృష్ణా జిల్లా కలెక్టరు జె. పాశెగారి అధ్యక్షతను నిన్న మధ్యాహ్నము జిల్లా ఆహారసంఘ సమావేశం కలెక్టరుగారి ఆఫీసులో జరిగెను. ఈ సభకు కొల్లి పరమూరయ్య, యం. యల్. ఎ. కాకాని వెంకటరత్నం (జిల్లా బోర్డు అధ్యక్షులు) తూర్పుకృష్ణా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు మాగంటి అంకినీడుగారలు, అధికారులు హాజరైరి. కమిటీ కార్యదర్శి అయిన జిల్లా సప్లయి ఆఫీసరు సి. సూర్యప్రకాశరావునాయుడు గారు తమ నివేదకను సమర్పించిరి. నివేదికలో తుపాను, వరదలవల్ల ముట్టడించబడిన గ్రామములకు ఎటుల బియ్యము సరఫరాచేసినది తెలియజేయబడెను. డిసెంబరు 10-వ తేదీ అంత్యమైనవారమునకు 1678 టన్నుల బియ్యము నిల్వయున్నదనియు, జిల్లాలో 1067 టన్నుల బియ్యము కావలసియున్నదనియు, పాలుక్కల్లు, బసంగిధాన్యము మార్కెట్టులోనికి వచ్చుచున్నదనియు, 1 నవంబరునుండి 2169 టన్నుల బియ్యము సేకరింపబడ్డదనియు 10 డిశంబరుకు 826 టన్నుల బియ్యము సేకరించబడ్డదనియు తెలియజేయబడెను. గుడివాడ, కైకలూరు బందరు తాలూకాల్లో విస్తారముగా వరిపైరు తుపానవల్ల నష్టపడినందున, ప్రతి గ్రామములోను పైరుకోత పరిశోధనలు చేయబడుతున్నవనియు, ఈపని పూర్తి అయిననేగాని, ధాన్యపు రాబడి అంచనా వేయుటకు వీలుకాదనియు 1950 సం||ము జనవరి ఆఖరువరకూ జిల్లానుండి బియ్యము ఎగుమతి ఆపుదల చేయడమైనదనియు నివేదికలో తెలియజేయబడింది. నవంబరు 20 నుండి నందిగామ, నూజివీడు, గన్నవరం, బెజవాడ తాలూకాల్లోని ఎనుకబడినప్రదేశాలలో రేషనుషాపులు ఏర్పాటు చేసి రేషను ప్రకారం బియ్యము గోధుమలు సప్లయి చేయబడుచున్నవనియు సప్లయి ఆఫీసరుగారు తెల్పిరి.

ఆత్మూరు నాగేశ్వరరావుగారు సంఘ సభ్యులకు సమావేశపు ఎజెండా పంపబడుట లేదని తెలియజెయ్యగా, అనధికార సభ్యులు తీర్మానములను యేమీ పంపనందువలన ప్రత్యేకించిఎజెండా లేదనియు మామూలుగా వుండే కార్యదర్శి నివేదిక మాత్రము సమావేశానికివచ్చినదనియు అధ్యక్షులు జవాబిచ్చిరి.

కాకాని వెంకటరత్నంగారు, వరిపైరు అజమాయిషీ చేయుచున్న ఉద్యోగస్థులు అవినీతిగా ప్రవర్తిస్తున్నారని తెలుపగా కలెక్టరుగారుసమాధానమిచ్చుచు సామాన్య ధోరణిలో చెప్పుటకన్న ఏదైన కేసులు పట్టుకొని తెచ్చినచో తగిన చర్య తీసుకొనెదమని జవాబిచ్చారు. స్వ. వి.

## హైదరాబాద్ కార్మిక సమ్మె వాయిదా

### మజ్దూర్ సంఘ ప్రకటన

హైదరాబాదు, డిసెంబరు 18: ఈ నెల 22 వ ప్రారంభమవుతుందని ప్రకటింపబడిన 52 వేలమంది సంస్థాన కార్మికుల సమ్మె జనవరి 11 వ తేదీకి వాయిదా పడింది.

ఈ 52 వేలమంది సోషలిస్టు ప్రాబల్యంలోని హైదరాబాదు సంస్థాన మజ్దూర్ సంఘమునకు చెందిన 47 ట్రేడ్ యూనియన్ల సభ్యులు.

సమ్మెచేయటానికి నిర్ణీతమైన 22 వ తేదీ నాటికి గవర్నరు జనరలు రాజాజీ, జయప్రకాశ్ నారాయణ్ కూడా హైదరాబాదులో ఉంటారు కనుక, ప్రజలలో సమ్మె ఉద్దేశ్యాన్ని గూర్చి అపోహలు ప్రబలుతున్నాయనీ, సమ్మెను వాయిదా వేస్తున్నప్పటికీ అసలు నిర్ణయం మారలేదనీ సంఘ కార్యవర్గం తెలియజేసింది.

## సికింద్రాబాదుకు జయప్రకాశ్ రాక

సికిందరాబాదు, డిసెంబరు 14: సోషలిస్టుపార్టీ కార్యదర్శి జయప్రకాశ్ నారాయణ సతీసమేతంగా నేటి మధ్యాహ్నం నాగపూరునుండి ఇచటకు విమానంలో వచ్చారు. ఆయన ఇక్కడ ఉన్న 9 రోజుల్లో కమ్యూనిస్టుబాధితప్రాంతమైన వరంగల్లుకు, భోగ్గనుల ప్రాంతమైన కొత్తగూడెంకు వెళతారు. ఈ నెల 22 వతేదీన సికిందరాబాదులో పౌరసన్మానం జరుగుతుంది.

## 4 కోట్ల రూ. వ్యయంతో కృత్రిమసిల్కుఫ్యాక్టరీ నిర్మాణం

హైదరాబాదు, డిసెంబరు 14: యంత్ర సహాయంతో కృత్రిమ సిల్కును తయారు చేసే ఫాక్టరీ ఒకటి హైదరాబాదుసంస్థాన ఈశాన్య సరిహద్దున 4 కోట్ల రూ|| వ్యయంతో ప్రస్తుతం నిర్మింపబడుతున్నది. ఇండియాలో కల్లా ఇదే మొదటి కృత్రిమ సిల్కు ఫాక్టరీ. ఇది పూర్తయిన తరువాత రోజుకు 50 వేల గజాల కృత్రిమసిల్కును తయారు చేయగలదట.

### యాత్రికులకుఇచ్చే రేషనులు

చెన్నపట్నం, డిసెంబరు 14: యాత్రికులకు ఒక యాత్రస్థలానికి వెళ్లేప్పుడు ఒకసారి ఇచ్చే నాల్గురోజుల రేషన్లో ఒక జొన్న గోధుమ బలవంతంగా తీసుకోనవసరంలేదనీ, వారి ఇష్టమైతే తీసుకోవచ్చు లేకపోతే మానివేయవచ్చునని ప్రభుత్వ ప్రకటన తెలుపుతున్నది.

## 'డాక్టర్' బిరుదు వాడక నియమములు

మదరాసు, డిశంబరు 14: అర్హతలు లేకుండా వైద్యము చేయుచున్న అనేకమంది వ్యక్తులు వారిపేర్లకు డిగ్రీలున్నట్లు టైటిల్సు, అక్షరములు తగిలించుకొంటున్నట్లు ప్రభుత్వమునకు తెలియవచ్చినది. ప్రభుత్వము 1947 మే 8 వ ఇండియన్ మెడికల్ డిగ్రీల యాక్టులో ఇందుకు సంబంధించిన షరతులను 1940 సం|| పు సవరణ చట్టములోని షరతులను వివరించి పై షరతుల ఉల్లంఘన జరిగిన అపరాధములు చెల్లించవలసియుండునని హెచ్చరించెను.

అర్హతలు లేనివారిని సహాయకులుగా నియమించిన మదరాసు మెడికల్ రిజిష్టరు నుండి పేర్లను తొలగించెదమనికూడ వైద్యవృత్తివారికి హెచ్చరిక ఇచ్చుట జరిగెను.

దొంగ టైటిల్సును కొంతమంది దేశీయ వైద్యులు వాడి తప్పిదనుచేయుచున్నారు. అట్టివారు రెండు తరగతులుగా విభజించబడిరి. యల్. ఐ. యం. అర్హతగలవారు ఎ, తరగతి దేశీయ వైద్యులుగా నమోదు కావచ్చును. కొంతమంది 'బి' తరగతిగ నమోదుకావచ్చును. 'ఎ' తరగతివారు దేశీయ వైద్యులమని, వారి అర్హతలు తెలిపిన డాక్టరు అనే పదమును వాడవచ్చును. 'బి' తరగతి వైద్యులు ఏపరిస్థితులలోనూ వారిపేర్లకు 'డాక్టర్' అనేమాట చేర్చకూడదు. అయితే వీరు వైద్య అనిగాని హకీం అనిగాని వాడవచ్చును. ఈ నియమములను అతిక్రమించినవారు శిక్షకు పాత్రులగుదురని హెచ్చరించుచూ మదరాసు ప్రభుత్వ ప్రచారశాఖ డైరెక్టరు ప్రకటించుచున్నారు.

# టర్కీలో భారత రాయబారి సమస్య

## పార్లమెంటులో ఘర్షణ: కామత్‌గారికిమందలింపు

న్యూఢిల్లీ, డిశంబరు 14: టర్కీకి పంపిన భారతరాయబారివిషయమై హెచ్. వి. కామత్ గారు అడిగినఅనుబంధప్రశ్నకు పార్లమెంటు అధ్యక్షులూ ప్రధానమంత్రి కూడా ఆక్షేపణ తెలియజేయటంలో చిన్నఘర్షణ జరిగింది

ప్రధానప్రశ్నకు సమాధానంగా నెహ్రూ, 'టర్కీలో వుండే మనరాయబారి ఆయన ఉద్యోగపరిమితి తీరిపోయిన అనంతరం ఇంటికి తిరిగివచ్చేశారు. మళ్ళీ క్రొత్తవారిని నియమించటం కొంతవ్యవధి తీసుకొంటుంది' అని సమాధానం చెప్పారు.

కామత్: టర్కీలో మనరాయబారి సాధించిన ప్రధానకార్య మేమిటి?

నెహ్రూ: ఒక ప్రభుత్వోద్యోగిగాని, యీ పార్లమెంటులో ఒక సభ్యుడుగాని సాధించిన ప్రధాన కార్యమేమిటో అంటే యిదమిద్దమని నిరూపించటానికి సావకాశంవుండదు.

కామత్:— బ్రెజిలియన్ వ్యాపార ఒడంబడికతో సహా ఆయన యెన్నో దొడ్డ కార్యాలు చేశారని చెప్పారుగదా, మరి యిప్పుడు ఆ విషయమై బోలెడంత వాదప్రతివాదం జరుగుతూ వుండటానికి కారణమేమిటి?

నెహ్రూ:— నేను యే ప్రశ్నకైనా సమాధానం చెప్పటానికి సిద్ధంగానే వున్నాను. కాని అధ్యక్షులను ఒక్కటి అడుగుతున్నాను — ప్రశ్నల రూపంలో యితరుల మీద నిందలు వేయవచ్చునా?

కామత్:— నేను కార్యక్రమంలో వున్న వ్యవహారమే ప్రశ్నించాను. అందుచేత ఇందులో నిందలు వేటయున్న ప్రసక్తే లేదు.

అధ్యక్షులు:— ఇలా నిందలు వేయటం యే సభ్యునకూ కూడదు. ఈ అలవాటు నేను సభ్యులలో చాలా రోజులనుంచి చూస్తున్నాను. ఇకముందు సభ్యులు జాగ్రతగా ప్రసంగించాలి—ఒక ప్రత్యేక వ్యక్తిని అధికారంలో నియమించటం, నియమించక పోవటం అది ప్రభుత్వ ఇష్టానిష్టాలమీద ఆధారపడి వుంటుంది.

కామత్:— అధ్యక్షులకు గౌరవ పురస్సరంగా మనవి చేస్తున్న దేమంటే......

అధ్యక్షులు:— మీరు కూర్చోవాలి!

కామత్:— ఇది చాలా విచిత్రంగా వుంది.........

అధ్యక్షులు:— కూర్చోవాలి.

కామత్:— కూర్చున్నా స్వామీ: (నవ్వు)

నెహ్రూ:— అధ్యక్షులపట్ల కామత్ గారు చూపిన అగౌరవం యే సభ్యులు చూపినా అది చాలా విచారకరం.

పొన్నూరు సబ్ తాలూకా రాజకీయ బాధితుల సభ పుట్టా సుబ్బయ్య ఎమ్. ఎల్. ఏ. గారి అధ్యక్షతను యీ నెల 27 న పొన్నూరులో జరుగును.

# బర్మాకు కామన్వెల్తు సహాయం

## రేపు నెహ్రూతో బర్మా విదేశాంగమంత్రి సమాలోచన

రంగూన్, డిసెంబరు 15: బర్మాకు కామన్వెల్తు ఆర్థికసహాయానికి సంబంధించిన కొన్ని విషయాలను చర్చించేందుకు గాను, శుక్రవారంనాడు ఢిల్లీవెళ్లి నెహ్రూతో సమాలోచిస్తానని, బర్మా విదేశాంగ మంత్రి యూమాంగ్ నిన్న ప్రకటించాడు. భారత రాజధానినగరంలో 24 గంటలసేపు ఉంటానని యూమాంగ్ పత్రికా విలేఖరులతో అన్నాడు.

రష్యాతో రాయబార సంబంధాలను యేర్పాటు చేసుకో సిద్ధంగా ఉన్నామని బర్మా తెలిపినప్పటికి, యింతవరకూ రష్యా సుముఖత తెలుపలేదని యూమాంగ్ వెల్లడించాడు.

చైనాయుద్ధం గురించి చెబుతూ, పారిపోయి వస్తున్న జాతీయచైనావారు బర్మా సరిహద్దును సమీపాన లేరని అన్నాడు.

## లండన్‌లో షేక్ అబ్దుల్లా

లండన్, డిసెంబరు 14: భద్రతామండలి కాశ్మీర్ సమస్యను, చర్చించేటప్పుడు హాజరుగా ఉండేనిమిత్తం లేక్‌సక్సెస్ వెడుతున్న కాశ్మీర్ ప్రధాని షేక్ అబ్దుల్లా యీవేళ మధ్యాహ్నం లండన్‌లో దిగి, కొన్ని గంటలసేపు ఉండి మళ్లీ బయలుదేరి వెళ్లాడు.

అబ్దుల్లా లండన్‌లో, భారత హైకమిషనర్ వి. కె. కృష్ణమీనన్‌ను కలుసుకొన్నాడు.

## పశ్చిమ బెంగాలు పరిశ్రమల శాఖ మాజీ డైరెక్టరుకు కఠిన శిక్ష

### లంచాలు తీసుకున్న నేరం ఫలితం

కలకత్తా, డిశంబర్ 13: పశ్చిమ బెంగాలు పరిశ్రమలశాఖ డైరెక్టరు ఎస్. సి. మిత్తర్ గారికి ప్రత్యేక న్యాయవిచారణ సంఘంవారు మూడేళ్ల కఠిన కారాగార శిక్ష, రూ 1,94,199 జరిమానా విధించారు. లంచాలు తీసుకున్నాడనీ, కుట్రపన్నాడనీ ఇతడిపై నేరారోపణ జరిగినందున ఉద్యోగంనుంచి ఇదివరలో బర్తరఫు చేశారు.

## బుగ్గ అగ్రహారంలో కలరా

### నలుగురి మరణం

నగరి, డిశంబర్ 13: ఇచ్చటికి 8 మైళ్ల లోగల బుగ్గ అగ్రహారంలో గత వారం రోజులనుండి కలరా వ్యాపించి, 9 మందికి సోకి, 4 గురు మరణించారు. వ్యాధి ఉధృతం తగ్గుముఖంలోకి వచ్చింది. ఆరోగ్యశాఖవారు వ్యాధినివారణకు తీవ్రంగా కృషి చేస్తున్నారు.

# జమీందార్లకు సగం పరిహారం మొత్తం అడ్వాన్సు

## జమీందారీ రద్దుచట్టమునకు సవరణలు

మదరాసు, డిశంబరు 14: మదరాసు ఎస్టేట్ల రద్దుచట్టముక్రింద యిజ్జాయింపుగా పరిహార మొత్తమును తేల్చి అందులో సగమును అడ్వాన్సుగా సర్వే సెటిల్‌మెంటులు పూర్తి కాకముందే చెల్లించుటకు ఉద్దేశించిన బిల్లును ప్రభుత్వము ప్రకటించెను.

ఈ బిల్లులో ఇకనూ జమీందార్లకు పరిహారముక్రింద రు. 12½ కోట్లు చెల్లించవలెననికూడా నిర్ణయించబడెను. ఈ సవరణలుగల బిల్లు శాసనసభలో త్వరలోనే ప్రతిపాదించెదరు.

బిల్లు ఉద్దేశ్యములు, కారణముల ప్రకటనలో ఇట్లు తెలిపిరి.

1948 సం|| పు ఎస్టేట్ల రద్దుచట్టముక్రింద ఎస్టేట ప్రకటించబడినవెంటనే రైతువారీపద్ధతులమీద సర్వే సెటిల్‌మెంటులు చేయవలసి యున్నది. ఈ పని పూర్తి అయ్యేవరకు పరిహారము చెల్లించుటకు వీలు లేదు. సర్వే సెటిల్‌మెంటులు పూర్తిఅవుటకు కొన్ని సంవత్సరములు పట్టును గనుక ఆకర్మకాండ పూర్తి అయ్యేవరకు వేచియుండక పరిహారములో కొంత మొత్తమును అడ్వాన్సుగా చెల్లించుటకు వీలువుంచుట యుక్తమని యెంచబడెను. ఈ బిల్లులో ఇందుకు వీలుగా క్లాజు 3 లో 54-ఎ అనే శెక్షన్ చేర్చబడెను. ఎస్టేటును ప్రకటించినవెంటనే ఉజ్జాయింపుగా పరిహార మొత్తమును తేల్చి అందులో సగము మొత్తమును ప్రకటించబడిన తేదీనుండి ఆరు నెలలలోగా ట్రిబ్యునల్ కార్యాలయములో డిపాజిటు చేయుదురు. చట్టముక్రింద నికరముగా తేల్చబడు పరిహారములో ఈ అడ్వాన్స లెక్కపూడబడును. శెక్షన్ 50 క్రింద ఏటేటా తాత్కాలిక చెల్లింపు వుంటుందిగాని మొత్తములో సగము తగ్గించిఅంత్యలెక్కలు తేల్చునప్పుడు అవసరమగు సర్దుబాట్లు చేయుదురు (బిల్లులో క్లాజులు 4, 5)

రాష్ట్రములోని జమీందార్లకు రు 12½ కోట్లకు తగ్గకుండా పరిహారము చెల్లించుటకు కూడ ఉద్దేశించబడెను. ఇందు నిమిత్తం క్లాజు 8 లో శెక్షన్ 54 బి. చేర్చబడెను. ఈశెక్షన్‌క్రింద లెక్కలు అన్నీ తేలిన దరిమిలా జమీందార్లకు చెల్లించవలసిన పరిహారం మొత్తం 12½ కోట్లకు తగ్గినచో ఆ తగ్గిన మొత్తము ఎస్టేట్లకు దామాషాలేటున పంచెదరు.

ఈ సందర్భానకాశము తీసుకొని చట్టములోని శెక్షన్ 40 (2) కూడా సవరించబడెను. యీ సవరణవల్ల ఈ శెక్షన్ క్రింద చేయు నియమములు లెజిస్లేటివు అసెంబ్లీయేగాక కవున్సిల్ ఆమోదము కూడ పొందవలసియుండును. అయితే ఈ సవరణ బిల్లు శాసనమగుటకు పూర్వము చేయబడిన నియమములకు వర్తించదు.

### బిల్లు వివరములు

1 ఈ యాక్టును 1949 వ సం|| పు మదరాసు ఎస్టేట్లు (రద్దు, రైతువారీగమార్పు) సవరణ చట్టమని చెప్పవచ్చును.

2. (1) పైచట్టము శెక్షన్ 40, సబ్ శెక్షన్ (2) లో "రాష్ట్రశాసన సభామోదము" అనేమాటలకు బదులు "రాష్ట్ర అసెంబ్లీ కవున్సిల్ ఆమోదము" అని చేర్చవలెను.

(2) సబ్‌శెక్షన్ (1) లో చేయబడిన సవరణపై చట్టము శెక్షన్ 40 క్రింద ఈ చట్టము అమలుకు వచ్చుటకు ముందు చేయబడిన నియమములకు వర్తించదు.

(3) శెక్షన్ 54 తరువాత ఈ క్రింది శీర్షికలను, శెక్షనులను చేర్చవలెను.

### పరిహారం అడ్వాన్సు ఇచ్చుట

7. 54-ఎ (1): శెక్షన్ 38 క్రిందికిరాని ప్రతిఎస్టేటు విషయములో ప్రభుత్వము అట్టి ఎస్టేటుకు చెల్లించవలసిన పరిహార మొత్తమును ఉజ్జాయింపుగ తేల్చి ప్రకటించబడిన తేదీనుండి 6 నెలలలోగా సగము మొత్తమునే పరిహార మొత్తము నుండి అడ్వాన్సుగా ట్రిబ్యునల్ కార్యాలయములో చెల్లించవలెను.

అయితే మదరాసు ఎస్టేట్ల రద్దు చట్టము అమలుకు రాకముందు ప్రకటించబడిన ఎస్టేటు విషయములో 1950 జూన్ 30 దాటకుండా డిపాజిటు వాయిదా వేయవచ్చును.

(2) సబ్ సెక్షన్ (1) క్రింద చెల్లించు డిపాజిటునుండి ప్రభుత్వము ఈ క్రిందివి తగ్గించవచ్చును:—

(ఎ) శెక్షన్ 41 (1) షరతులలో తెలిపిన పద్దులన్నిటిలోనూ సగము మొత్తము

(బి) శెక్షన్ 60 సబ్ శెక్షన్ (3)లో తెల్పిన ప్రాతిపదిక వార్షిక మొత్తములో సగము (డిపాజిటు మొత్తం ఈ శెక్షన్ క్రింద ఎస్టేటు ప్రకటించిన సాలులో జరిగి శెక్షన్ 50 క్రింద ఆ ఫసలీ తాలూకు తాత్కాలిక మొత్తం చెల్లించి నప్పుడు)

(3) ఈ శెక్షన్ క్రింద డిపాజిటు చేసినప్పుడు, డిపాజిటు చేయబడిన మొత్తమునకు సంబంధించిన అన్ని హక్కులు బాధ్యతలను ప్రభుత్వం పూర్తిగ తీర్చినట్లు యెంచబడును.

(4) ట్రిబ్యునల్ అవసరమైన పరిశీలనానంతరము డిపాజిటు మొత్తమును ప్రధాన యజమానికి శెక్షన్ 42లో ఉదహరించిన ఇతర వ్యక్తులకు ఆయా వ్యక్తుల సంబంధమును బట్టి పంచును. శెక్షన్ 42 నుండి 46, 48, 49, 51, 52, 53 శెక్షనులు డిపాజిటు చేయబడిన మొత్తము విషయములో యథాతథంగా వర్తించును,

### అదనపు పరిహారము

54-బి (1) శెక్షన్ 39 క్రింద ఎస్టేట్లకు చెల్లించవలసిన పరిహారము మొత్తము నికరముగా తేలగానే ఆ మొత్తము రు. 12½ కోట్లకు తగ్గితే పై తెలిపిన ఎస్టేట్లకు తగ్గిన మొత్తమును శెక్షన్ 39 క్రింద నిర్ణయించబడే పరిహార మొత్తముల దామాషాను ప్రభుత్వము చెల్లించగలదు.

(2) సబ్‌శెక్షన్ (1) క్రింద ప్రతి ఎస్టేటుకు చెల్లించే మొత్తమును ప్రభుత్వము ట్రిబ్యునల్ కార్యాలయములో కట్టును. అట్లు డిపాజిటు కట్టగనే డిపాజిటు మొత్తముపై గల బాధ్యతలన్నీ ప్రభుత్వమునకు తీరిపోవును.

(3) ట్రిబ్యునల్ అవసరమైన విచారణలు జరిపి శెక్షను (2) క్రింద డిపాజిటు చేయబడిన మొత్తమును యజమానికి శెక్షన్ 42 లో ఉదహరించిన వ్యక్తులకు వారి వారి సంబంధమునుబట్టి పంచును. శెక్షనులు 42 నుండి 46, 48, 49, 51, 52, 53 లోని షరతులు యథాతథముగా ఇట్లు డిపాజిటు చేయబడిన మొత్తమునకు వర్తించును.

4. శెక్షన్ 41 లోని మార్పులు.

5. శెక్షన్ 50 లోని మార్పులు.

## మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 15:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి ఎక్స్ట్రా బొంబాయి సేల్సుటాక్సుతోసహా రు. 76 10-0 పెట్లా బంగారు తులం 116-8-0 మూసబంగారు 113-10-0 సీమవెండి తులం 1-0-8 (రెడీ 174-0-0 వెండి తులం 1-8 1-12 6

వేరుసెనగ: (581 కా 1-కి ఎక్స్ గోస్తాగిడ్డంగులు) మెషీన్ (సేల్సుటాక్సుతోసహా) బజారు కొత్తది రు. 162-8-0 163-0-0

(కోరమండల్)

వేరుసెనగనూనె ఎక్స్ పెల్లర్ (ఏపరేజి) రు. 328 329 3% యఫ్. యఫ్. ఎ. వేరుసెనగనూనె (87 గాలన్ల డబ్బా) ఒకటికి కొచ్చిన్ క్వీలాన్. రు. 88-4-9, 89-9-9

పంచదార

| | | |
|---|---|---|
| హసన్‌పూర్ | ,, | రు. 93-14-0 |
| మోతీపూర్ | ,, | రు. 94-7-10 |

## న్యూయార్కు దూది

న్యూయార్కు, డిసెంబరు 14:

డిసెంబరు 30.28 / 30 23 మార్చి 30 16 / 30 18 మే 29 97 / 29.97 జూలై 29 49/29 49 అక్టోబర్ 27 96/27.96 డిశంబరు 27.82/బిడ్ 27.84 అస్కుడ్ మార్చి 27.75/ బిడ్ 27 77 అస్కుడ్ మే 27.72/బిడ్ 27 71 అస్కుడ్.

| | | |
|---|---|---|
| స్పాట్ బాంబే సైడింగ్ | బజారు | 30 85 |
| మార్చి | (గరిష్ఠధర) | 30.23 |
| | (కనిష్ఠ ధర) | 30 15 |

# ఆకివీడులో సహాయకేంద్రం

## 600 మందికి వస్త్రదానం

భీమవరం, డిసెంబరు 13 : గత మంగళవారం కలకత్తా మార్వాడీ సహాయసంఘం వారు, కొల్లేటిముంపు బాధితులకు వైద్య సౌకర్యం, వస్త్రప్రదానం చేయాలనే సంకల్పంతో, డాక్టరు సర్కార్ శర్మగారలు వారివారి పరివారంతో సహావచ్చేసి కుటుంబరెడ్డిగారింట్లో దిగారు. రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గసభ్యులు రామచంద్రరాజు, తాలూకా కాంగ్రెసు అధ్యక్షులు దంతులూరి కృష్ణంరాజు శ్రీమతి అనసూయాదేవి, చెరుకువాడ సుబ్బారావు భీమవరం నుండి వెళ్ళి సహాయసంఘం వారిని తీసుకొని కొల్లేటివల్ల మునిగిన సిద్ధాపురం, ధర్మాపురం, దుంపగడప గ్రామాలలో పర్యటించారు. డాక్టరు శర్మగారు ఆకివీడులో నెలకొల్పిన వైద్యశాలకు ఆయా గ్రామలలో రోగపీడితులైన వార్లను రమ్మని హెచ్చరించారు. ఆదివారం భీమవరం డిప్యూటీ కలెక్టరు శ్రీ రామకృష్ణయ్యగారిచే సహాయ కేంద్ర ప్రారంభోత్సవం జరుపబడింది. శ్రీమతి అనసూయాదేవిచే సంఘంవారు సుమారు 600 మందికి వస్త్రప్రదానం చేయించారు. గాదిరాజు జగన్నాథరాజు, చెరుకువాడ వెంకటసుబ్బారావు శ్రీమతి అనసూయాదేవి, డిప్యూటీ కలెక్టరుగారు సంఘంవారి సేవను ప్రశంసించారు. స్వ. వి.

### జంషెడ్పూరంలో ఆంధ్ర తుపానుబాధిత సహాయ సంఘం

జంషెడ్పూరం, డిసెంబరు 12: ఆంధ్రలో యిటీవల వచ్చిన తుపానువల్ల నష్టపడినవారి సహాయార్థం విరాళములు వసూలుచేయు నుద్దేశ్యంతో బి. ఆర్. కాగార్ గారి అధ్యక్షతను ఒక సంఘం ఏర్పాటు చేయబడెను. ఇందులో నగరంలోని అన్ని వర్గాల ప్రముఖులు సభ్యులుగనున్నారు. ఈ సంఘంవారు వసూలుచేయు విరాళములు మద్రాసు గవర్నరు ఆంధ్రతుపాను బాధిత సహాయనిధికి పంపబడెను. విరాళములు వసూలుచేయు సందర్భంలో జె. ఆర్. డి. టాటాగారివద్దకు ప్రత్యేకంగా ఒకరాయబారం పంపుటకు సంఘంవారు నిర్ణయించారు.

### పరారీలోని కమ్యూనిస్టుల అరెస్టు

విజయవాడ, డిసెంబర్ 12 : మైలవరం సబిన్‌స్పెక్టర్ ఎ. వెంకటేశ్వర రావుగారు పరారీలో ఉన్న కె. నాగభూషణం అనే ఒక కమ్యూనిస్టును అరెస్టుచేశారు. పరారీలోవున్న మరో కమ్యూనిస్టు ఎస్. గోపాలరావు అనే అతనిని కొండపల్లి సబిన్‌స్పెక్టర్ అరెస్టుచేశారు. స్వ. వి.

### కొల్లూరిగ్రామంలో అగ్ని ప్రమాదం

తెనుకు, డిశంబరు 10 : ఈ తాలూకా కొల్లూరిగ్రామ హరిజనవాడలో మొన్న అగ్నిప్రమాదం సంభవించి దాదాపు 25 యిండ్లు పరశురామప్రీతి యైనవి. రాత్రి 12 గంటలకు యిది సంభవించటంవల్ల బీద హరిజనులు ప్రాణములు దక్కించుకొని బయటపడుట దుస్తరమైనది. మరునాడు గ్రామ రైతు కాంగ్రెసు సంఘంవారు బాధితులకు భోజనసదుపాయము చేసిరి.

### రాష్ట్ర కాంగ్రెసుకు ఆంధ్ర మహాసభ సలహాలు

తాడేపల్లిగూడెం, డిశంబరు 12: జనవరి 26 లోగా ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పరచకపోతే భారత రిపబ్లిక్ అవతరణోత్సవాలలో పాల్గొనమని, జె. వి. పి. రిపోర్టుకు తమ అంగీకారమును ఉపసంహరించుకొని మద్రాసు నగరంపై తమ హక్కులను ఉద్ఘాటిస్తామనీ, భారత ప్రభుత్వమును హెచ్చరించవలెనని మొన్న యిక్కడ సమావేశమైన ఆంధ్రమహాసభవారు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసుకు సలహా ఇచ్చారు.

ఈ నెల 18 వ తేదీని "ఆంధ్రదినోత్సవం" జరుపవలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చెయ్యమని, జనవరి 26 కు రాష్ట్రం ఏర్పడనిచో ఆంధ్ర ఎమ్. ఎల్. ఎ. లు, ఎమ్. ఎల్. సి. లు రాజీనామానివ్వవలెనని ఒత్తిడిచెయ్యమనికూడా మహాసభవారు రాష్ట్ర కాంగ్రెసువారికి సలహా ఇచ్చారు.

### తాడేపల్లిగూడెం తాలూకాలో 55, 604 కాంగ్రెస్ సభ్యులు

తాడేపల్లిగూడెం, డిసెంబరు 12: ఈ తాలూకాలో మొత్తం 55, 604 మంది కాంగ్రెసు ప్రాథమిక సభ్యులుగా చేరినట్లు తాలూకా కాంగ్రెసు ఆఫీసు ఉద్యోగి తెలిపారు. (స్వ. వి)

### మద్యనిషేధ ప్రచారాధికారుల నిర్ణయసంఘం

ఏలూరు, డిసెంబరు 12 : మద్యనిషేధ ప్రచార అధికారుల నిర్ణయసంఘం (తెలుగుజిల్లాలకు) గుంటకల్లులో ఈ నెల 22, 23, వ తేదీల్లో సమావేశమై, అనంతపురం, కడప, కర్నూలు, బళ్ళారి జిల్లాలనుంచి దరఖాస్తు పెట్టుకొన్న అభ్యర్థులకు ఇంటర్వ్యూ లిస్తుందని పైసంఘాధ్యక్షుడు డా॥ ఎస్. రంగయ్యగారు వ్రాస్తున్నారు.

# ఆంధ్ర విద్యార్థి ఒలింపిక్ పోటీలు

## రాష్ట్రకాంగ్రెస కార్యదర్శి విజ్ఞప్తి

విజయవాడ, డిసెంబరు 13 : ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ ప్రధానకార్యదర్శి కందుల ఓబులరెడ్డిగారిట్లు వ్రాస్తున్నారు.

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత దేశపునర్నిర్మాణానికి ప్రతి వర్గంయొక్క బాధ్యతకృషి అవసరమైనట్లే విద్యార్థుల కృషికూడ అవసరం. అందుకే రాష్ట్ర కాంగ్రెస్ ప్రోత్సాహంతో రాష్ట్ర విద్యార్థి కాంగ్రెస్ తన కార్య కలాపాలను అధికోత్సాహంతో కొనసాగిస్తున్నది. ఒక్క రాజకీయ చర్చలతోనే అభ్యుదయం గమ్యస్థానాన్ని అందుకోబోదు. సాంఘికంగా, వైజ్ఞానికంగా కొత్త రీతుల్లో మార్పులు తీసుకొని రావటానికి విద్యార్థి కాంగ్రెస్ పూనుకొన్నది. విద్యార్థులకు సారస్వతరంగంలో చాలినంత అభిరుచిని కల్గించటానికి, యీ నెలాఖరున విజయవాడలో జరుగనున్న విద్యార్థి మహాసభలో నాటికలు, బుర్రకథలు, వ్యాసరచన పోటీలు మొదలగునవి ఏర్పాటుచేయబడినవి. అన్నిటికంటే ప్రధానమైనది ఒలింపిక్ పోటీలు. ఆంధ్ర విద్యార్థి కాంగ్రెస్ చరిత్రలో యీ కొత్త విధానం ఒక నవోత్సాహాన్ని కలిగించటమేగాక విశాలాంధ్రలోని విద్యార్థులలో ఎడతెగని ఐకమత్య మేర్పడుతుంది. ఆంధ్రావనిలో తొలిసారిగా జరగనున్న యీ ప్రయత్నాన్ని విద్యార్థులందరూ విజయవంతం చెయ్యాలనికోరుతున్నాను. ప్రజలు, కాంగ్రెస్ వాదులు, ఉదార పురుషులు కూడ యీ ప్రయత్నాన్ని విజయవంతం చెయ్యాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

### గుంటూరు నగర విద్యార్థి కాంగ్రెసు సంఘ సమావేశం

గుంటూరు, డిసెంబర్ 13 :— గుంటూరు నగర విద్యార్థి కాంగ్రెసు సర్వసభ్య, సమావేశము నిన్న సాయంకాలం 5 గం. లకు "నేతాజీ సేవా సమితి" ఆవరణలో జె. పి రంగా గారధ్యక్షతన జరిగినప్పుడు లోగడ కార్యవర్గ రాజీనామాను అంగీకరించి యీ దిగువ నూతన కార్యవర్గము నేకగ్రీవముగా ఎన్నుకొనిరి. శ్రీమతి పి. జయప్రద అధ్యక్షులుగాను, శ్రీ జి.ఆర్. ఫిలిప్స్ ప్రధాన కార్యదర్శిగాను, ఎ. రామయ్య కోశాధికారిగాను, ఎన్నుకొనిరి.

ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెస్ మహాసభలకు 50 ప్రతినిధులను ఎన్నుకొనిరి. గత సంవత్సరం మాచర్లలో జరిగిన గుంటూరు జిల్లా విద్యార్థి కాంగ్రెసు మహాసభలలో సక్రమంగా యెన్నికైన కొడాలి వీరయ్యగారధ్యక్షతన ఏర్పడిన జిల్లా విద్యార్థి కాంగ్రెసు కమిటీకి గుంటూరు నగర విద్యార్థి కాంగ్రెసుసంఘము అనుబంధముగా ఏర్పరుస్తూ, రాష్ట్రవిద్యార్థి కాంగ్రెసు వారు యీ జిల్లా కమిటీనే గుర్తించాలని కోరుతూ తీర్మానించిరి. గుంటూరులోని పేద విద్యార్థుల సహాయార్థం వందరూపాయిలు మంజూరు చేశారు.

మహాసభకు 450 పైగా విద్యార్థి కాంగ్రెసు సభ్యులు హాజరైరి.

### ముగ్గురు విద్యార్థి కాంగ్రెస్ ప్రముఖులపై చర్య

గుంటూరు నగర విద్యార్థి కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి జి. ఆర్. ఫిలిప్స్‌గారిలా ప్రకటించుచున్నారు:—

విద్యార్థి కాంగ్రెసు ప్రతిష్టకు భంగకరముగా ప్రవర్తించిన రాష్ట్ర విద్యార్థి కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు యస్ వీరాచారి. ఉప్పల నాగేశ్వరరావు, గుంటూరు నగర విద్యార్థి కాంగ్రెసు కార్యవర్గ సభ్యుడు కొమ్మినేని వెంకటేశ్వర్లు గార్లను విద్యార్థి కాంగ్రెసు నుండి తొలగిస్తూ నేటి నుండి 3 సంవత్సరముల వరకు విద్యార్థి కాంగ్రెసులో వారు ఏ పదవికైనను అనర్హులని, నేతాజీ సేవా సమితిలో జె. పి. రంగా గారధ్యక్షతను నిన్న సమావేశమైన సర్వసభ్య సమావేశమువారు తీర్మానించిరి

### ఆంధ్రఆయుర్వేద విద్యాపీఠ వైద్యవిద్వాన్ పరీక్ష

విజయవాడ, డిసెంబర్ 11 : వైద్య విద్వాన్ పరీక్షలు 1950 సం॥ మార్చి 13 వ తేదీనుండి ఆంధ్రదేశమునందలి 23 ముఖ్య కేంద్రములలో జరుగును. పరీక్షా దరఖాస్తు, రుసుము, ఫిబ్రవరి 15 వ తేదీలోగా చేరవలెను. పాఠ్యక్రమము, దరఖాస్తు ఫారము, కేంద్రములు మొదలుగాగల వివరములకు పరీక్షా కార్యదర్శిగారికి రెండణాలు తపాలాబిళ్ళలు పంపిన బడయగలరు, అని కె. విష్ణువర్ధనరావుగారు వ్రాశారు.

పల్లిపట్టు తాలూకా జమీన్ రైతుల మహాసభ యీ నెల 17 తేదీ కత్తెరపల్లె గ్రామంలో చిత్తూరుజిల్లా బోర్డు అధ్యక్షుల అధ్యక్షతను జరుగును.

# సినిమాలు విజ్ఞానదాయకములైవుండాలి

## జవహర్ టాకీస్‌ను ప్రారంభిస్తూ విజయవాడలో రంగాగారి ఉద్బోధ

విజయవాడ, డిసెంబరు 12: పగలల్లా కష్టపడి పనిచేసే శ్రామిక జనానికి చలనచిత్రాలు వినోదం కల్పించటమే కాక, అవిద్య అలవాట్లనుండి తప్పించే ఉపాయాంతరములుగా కూడ పనికివస్తున్నాయని అం. రా. కాం. అధ్యక్షుడు ఎన్. జి. రంగాగారు మొన్నటి రోజున ఇక్కడ "జవహర్‌టాకీసు" అనే క్రొత్త సినీమాహాలును ప్రారంభిస్తూ అన్నారు. ఆయన ఇంకా ఇలా అన్నారు.

ప్రజలలో సాంఘిక పావనత్వాన్ని, ఉన్నతా దర్శాలను పెంపొందించే చిత్రాలనే తీయవలసిందిగా నేను డైరెక్టర్లను, ప్రొడ్యూసర్లకు విజ్ఞప్తి చేస్తున్నాను. దక్షిణ భారత ప్రొడ్యూసర్లలో గ్రామ జీవితాన్ని, కిసాన్ సమస్యలను హృదయంగమంగా చిత్రించిన కీ॥ శే॥ గూడవల్లి రామబ్రహ్మంగారు, తక్కువ వ్యయంతో చిత్రాలను నిర్మించిన వై. వి. రావు ప్రశంసాపాత్రులు. సాంఘిక, పౌరాణిక చిత్రాలలో వేనిని తీసినా అవి ప్రజలలో విజ్ఞానమును పెంపొందించేటట్లుగా వుండాలి. ముసీఫిల్ముకొరత కారణంగా చిత్రాల పొడవును సాధ్యమైనంత తగ్గించాలి.

ఆంధ్ర తుపాను, వరదబాధితుల సహాయనిమిత్తమై గొప్ప కృషిచేసిన చిత్తూరు నాగయ్యగారిని, సినీమారంగంలోని తదితర ప్రముఖులను నేను కొనియాడుతున్నాను. తుపాను బాధితుల సహాయం కోసం వేయబోయే నాటకానికి అద్దె లేకుండా ఉచితంగా హాలునిచ్చిన జవహర్‌టాకీసు యజమానులకు, వై. కృష్ణారావుగారికి సాధన్యవాదాలు."

ఈ ప్రారంభోత్సవ సభకు ఎ కాశేశ్వరరావు గారధ్యక్షత వహించారు. డి. బలరామ కృష్ణయ్యగారు మాట్లాడారు. బి. వి. పంతులుగారు వందనము లర్పించటంతో సభ ముగిసింది. (స్వ వి.)

# ఆంధ్ర నాటక కళాపరిషత్తు

## వచ్చేఫిబ్రవరిలోవార్షికోత్సవం జరపాలని నిర్ణయం

పాలకొల్లు, డిసెంబరు 12: ఆంధ్ర నాటక కళాపరిషత్తు కార్యవర్గం నిన్న నిక్కడ సమావేశమై 1950 ఫిబ్రవరి ఆఖరివారంలో పరిషత్తు 16 వ వార్షికోత్సవాలు జరుపవలెనని నిశ్చయించింది.

కార్యవర్గసభకు కాజ వెంకట్రామయ్యగారధ్యక్షత వహించారు. పసల సూర్యచంద్రరావు, రాప్రూరి సత్యనారాయణరావు గార్లు తదితరసభ్యులు హాజరయ్యారు.

ఆంధ్రనాటక కళాపరిషత్ శాఖలను ఆంధ్రదేశమంతటా స్థాపించుటకు కావలసిన నియమ నిబంధనావళిని తయారుచేయటానికై, వి. అంజనేయశర్మ, డి. మధుసూదనరావు, రామచంద్ర కాశ్యపగార్లతో ఒక సంఘం నియమింపబడింది.

కృష్ణాజిల్లాలో ప్రభుత్వానుమతిలేకుండా నాటకములు వేయరాదని జారి అయిన నిషేధాజ్ఞను తొలగించవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ కూడా పరిషత్కార్యవర్గం తీర్మానించింది.

# సభలుసమావేశములు

తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసు కార్యవర్గసమావేశం యీనెల 20 వ బందరులో జరుగును.

### భా॥ రా॥ సమితి ఆంధ్రశాఖ కార్యవర్గ సమావేశము

విజయవాడ, డిశంబరు 12 : ఈనెల. 18 వ తేది ఆదివారం సాయంత్రం 4 గంటలకు విజయవాడ గోష్ఠి విద్యాలయములో భాషాప్రయుక్త రాష్ట్రసమితి ఆంధ్రశాఖ కార్యవర్గ సభ జరుగును. ప్రస్తుత రాష్ట్ర పరిస్థితులు మదరాసు భవితవ్యమునుగురించి సరిహద్దుల విషయములో రాష్ట్రేతరులు వెలిబుచ్చుచున్న అభిప్రాయములు మున్నగు విషయములనుగూర్చినీ, ఈ సమితి వార్షికసర్వసభ్య సమావేశము జరుపుటను గూర్చినీ, చర్చజరుగును. కనుక కార్యవర్గ సభ్యులందరు తప్పక విచ్చేయవలెనని పానుగపాటి వెంకటనాగభూషణంగారు తెలియజేస్తున్నారు.

### విశాఖపట్నం వైద్యసంఘ సమావేశం

విశాఖపట్నం, డిసెంబర్ 18 : స్థానిక వైద్యసంఘసమావేశం నిన్న సాయంకాలం జరిగినప్పుడు ఓపికేవున్న వైద్యులను, రైల్వే డాక్టర్లనూ, తమ ఉద్యోగ విధులతప్ప మరేవిధమైన యితర కేసులను తీసుకొనరాదని, ఉత్తర్వులు జారీచేయవలసిందిగా కోరుతూ తీర్మానంచేశారు. సభకు డా॥ పి. రామారావుగారు అధ్యక్షత వహించారు.



వేగేశ్వరపురంలో సూర్యచంద్రబోర్డు ఉన్నతపాఠశాల నూతన భవనమున (ప్రవేశోత్సవమును రాష్ట్ర) గవర్నరు భావనగర్ మహారాజాగారు జరిపిరి ఉత్సవారంభమునకు పూర్వం జరిగిన ప్రార్థన సమావేశము. గవర్నరుగారు, మాగంటి సీతారామదాస్ గారు (ప. గో. జిల్లాబోర్డు అధ్యక్షుడు) భవనదాత శ్రీ సూర్యచంద్రరావు గార్లు వరుసగా నిలబడియున్నారు. గవర్నరుగారి కుడిప్రక్కన ఉన్నవారు జిల్లాకలెక్టరు షేక్ అహమ్మద్ గారు.



గవర్నరుగారు గోదావరిజిల్లా పర్యటన సందర్భంలో రామపాదసాగర్ ప్రాజెక్టు స్థలమును నందిపర్వతమునుండి సందర్శించుచున్నారు.



నందిపర్వతము అంచున నిలబడి గోదావరి కిరువైపుల గల రమణీయ ప్రకృతి దృశ్యములను "సినీ కెమెరాతో" షూట్ చేస్తున్నారు.



విలువిద్యా ప్రదర్శనము : పోలవరానికి 5 మైళ్ళ దూరంలో ఉన్న సింగనపల్లె అనే కోయగ్రామంలో గవర్నరుగారు కోయవారి విల్లు, అంబులు తీసుకొని గురి తప్పకుండా రెండు పర్యాయములు విల్లును ప్రయోగించారు. గవర్నరుగారి ప్రక్కన విల్లు పట్టుకొని ఉన్నవారు వారి మిలిటరీ కార్యదర్శి మేజర్ సి. ఎస్. రెడ్డిగారు.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press No. 7, Thambu Chetty Street, G. T. Madras.

# గుంటూరు జిల్లాలో గవర్నరు దంపతుల పర్యటన

## అమరావతీ చారిత్రక వస్తుప్రదర్శనాలయ సందర్శనం: లాం పశుశాలవారికి గవర్నరు సలహా

గుంటూరు, డిశెంబరు 13: నేటి పేపరు కుముందు 2 గంటలవేళ మద్రాసు గవర్నర్ మహారాజా శ్రీకృష్ణకుమారసింహజీ భావసింగ్ జీ, మహారాణి విజయాబాసతి, సపరివార సమేతముగా ఏలూరునుంచి ప్రత్యేక రైలులో గుంటూరు విచ్చేసిరి.

• శ్రీమతి రుక్మిణీ ప్రభాకరరావు, గవర్నర్ దంపతులకు, జిల్లా కలెక్టర్ యస్. కనకసుందరం, జిల్లా పోలీస్ సూపరింటెండెంట్ బి. యస్. కళ్యాణరావు, జిల్లా జడ్జి అబ్దుస్ సత్తార్, రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్ డి. రామచంద్రరావు, డిప్యూటీ పోలీస్ సూపరింటెండెంట్ పసుపతి అయ్యర్, ట్రెజరీ డిప్యూటీ కలెక్టర్ వి. ఆర్. కృష్ణస్వామి, జిల్లా కలెక్టర్ యొక్క అంతరంగిక సహాయకుడు రామానుజదాసుగారలను, పరిచయముచేసిరి.

వచ్చిన వెంటనే గవర్నర్ దంపతులు, అమరావతికి బయలుదేరిరి. దారిపొడుగున, గ్రామములవద్ద గ్రామస్థులు త్రివర్ణపతాకములతో నిశ్శబ్దముగా రోడ్డుకు ఇరుప్రక్కల నిలచి తమ గౌరవమును ప్రదర్శించిరి.

అమరావతిలో గవర్నర్ దంపతులు ముందుగా చారిత్రక వస్తు ప్రదర్శనాలయమును సందర్శించిరి. చారిత్రకవస్తు సంరక్షణశాఖ సూపరింటెండెంట్ డా॥ ఆర్. సుబ్రహ్మణ్యం, అమరావతీ స్తూపమునుంచి, ఇంగ్లండ్, కలకత్తా, బొంబాయి, మద్రాసులకు చేరవేయగా మిగిలి వున్న శిల్పముల ప్రాముఖ్యతను గవర్నర్ దంపతులకు వివరించిరి. పరిసరములందు, భూగర్భమున ఎంతో శిల్పసంపద ఇంకనూ అజ్ఞాతముగా నున్నట్లు చారిత్రక పరిశోధకుల భావమని డా॥ సుబ్రహ్మణ్యం తెల్పిరి. స్తూపము పూర్వము నిలచిన స్థలము, ప్రదర్శనాలయమునకు ప్రక్కనే కలదు. గవర్నర్ దంపతులు ఆ పురాతన క్షేత్రమునుచూచి, తమ దర్శనార్థమై అచట నిలచిన జనులకు సగౌరవముగా నమస్కరించిరి. ప్రదర్శనాలయమును అభివృద్ధిచేయవలెనని గవర్నర్ గారు సూచించిరి.

అమరావతీ చారిత్రక వస్తుప్రదర్శనాలయము ఒక రేకుల షెడ్డులో ఏర్పాటుచేయబడినది. లోపల నేలపై కపపరాళ్ళనైననూ పరచలేదు.

తర్వాత అమరావతి హైస్కూల్ ప్రధానోపాధ్యాయుడు తమ స్కూల్ విద్యార్థులు నడపుచున్న "నమోనా ప్రభుత్వ"పు నాయకులను, గవర్నర్ గారికి పరిచయము చేసిరి. నమోనా ప్రభుత్వపు ప్రధానిని, పోలీసుమంత్రిని, గవర్నర్ గారికి పరిచయము చేసిన తదుపరి, "మీ హోదా ఏమిటి?" అని ప్రధానోపాధ్యాయుని గవర్నర్ గారడిగిరి. "నేను గవర్నరును" అని ప్రధానోపాధ్యాయుడు అనగా అందరూ నవ్విరి.

అనంతరం గవర్నర్ దంపతులు అమరేశ్వరాలయమును సందర్శించిరి. ఆలయ ధర్మకర్త గోళ్లమూడి శంకరప్రసాదరావు గవర్నర్ దంపతులకు మేళతాళములతో స్వాగత మిచ్చిరి. శిలాశాసనముల ప్రదర్శనాలయమువలెనున్న, అమరేశ్వరాలయము చుట్టు, గవర్నర్ దంపతులు, వేదపారాయణ చేయుచున్న పండితుల ననుసరించుచూ ప్రదక్షిణము చేసిరి. తదుపరి మహారాజ దంపతులు అమరేశ్వరునికి సహస్రనామార్చన పూజ చేయించిరి.

అమరేశ్వరలింగము చాలా నిడుపుగా నుండును. అమరావతీ బౌద్ధస్తూప శిఖరము పైనున్న ఛత్రపు 'కామ'ను శైవులు విరుగగొట్టి తెచ్చి, దానికి పవిత్రా రామలింగముగా ప్రాణప్రతిష్ఠచేసిరి. అమరావతి పంచరామ క్షేత్రములలో నొకటి.

అమరావతిలో సుబ్బా శ్రీరాములు, గవర్నర్ గారికి తుపాను నిధికై నూటపదహార్లను సమర్పించిరి.

### లాం పశువుల అభివృద్ధి పరిశోధన కేంద్రం

అనంతరం గవర్నర్ గారు 'లాం' పశు అభివృద్ధి పరిశోధన కేంద్రానికి బయలుదేరిరి. కేంద్రంవద్దకు చేరగానే, పశువుల అభివృద్ధి పరిశోధనశాఖా సూపరింటెండెంట్ థామస్ బెంజమిన్, పశుశాల మేనేజర్ యం. యస్. ఆర్. ఆంజనేయులు, జిల్లా పశువైద్యశాఖాధికారి అప్పారావుగారలు గవర్నర్ గారికి స్వాగతమొసగి, యీ కేంద్రంలో పశువుల అభివృద్ధికై జరుగుచున్న కార్యక్రమమును వివరించిరి.

ఈ పరిశోధన కేంద్రములో 300 ఒంగోలు ఆబోతులు గిత్తలు, ఆవులు, దూడలు, 60 దున్నలు, బర్రెలు, దూడలు ఇవిగాక గొర్లు పెంచబడుచున్నవి. ఇచట పోషించబడుచున్న ఆవులు, చుట్టుపట్లలో మామూలుగా ఆవులు ఇచ్చు పాలకు, తేలికగా రెట్టింపు పాల నిచ్చుచున్నట్లు కేంద్రాధికారులు తెల్పిరి. ఈ పశు కేంద్రమునుండి ఆబోతులను, దున్నబోతులను పరిసర గ్రామములవారి పశు సంపదాభివృద్ధికై ఉపయోగింప నిత్తురు. కేంద్రముక్రింద 210 ఎకరములు, పశువుల ఆహారమునకై ప్రత్యేకింపబడినది. ఇది గాక 149 ఎకరముల పచ్చికబయలున్నది. పశుపోషణకు, పాల ఉత్పత్తికి పెంచుటకు కావలసిన ఆహారములకు ఇచటి ఉద్యోగులు రైతులకు తెల్పుచుందురు.

ఆవులను కొన్ని ఈతలైన తదుపరి, పరిసర ప్రాంతములలోని రైతులకు అమ్మివేసినచో, వారికి ఒకటి రెండు మంచి రకపు దూడలు లభింపగలవనియు, ఈలోగా క్రొత్త పెయ్యలను, కేంద్రమువారు పెంచవచ్చుననియు, ఆ విధముగా మేలురకపు పశువుల వ్యాప్తి జరుగుననియు గవర్నర్ గారు సూచించిరి గవర్నర్ గారు బాగుగా కనపడుచున్న ఆవులను, ఆబోతులను ఫోటోలు తీసిరి.

తదుపరి గవర్నర్ గారు గుంటూరుకు తిరిగివచ్చి, పురపాలక సంఘాధ్యక్షుడు ఉప్పుటూరి పున్నారావు, జిల్లాబోర్డు అధ్యక్షుడు నల్లూరి రాజయ్య, జిల్లా వెల్ఫేర్ సంఘాధ్యక్షుడు పి. వి. కృష్ణయ్య చౌదరి, జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు ఆలపాటి వెంకట్రామయ్య గారలకు దర్శనమిచ్చిరి.

### సెంట్ జోసెఫ్ కాన్వెంటు

అమరావతినుంచి గవర్నర్ సతి మహారాణి విజయాబాగారు, శ్రీమతి రుక్మిణి ప్రభాకరరావుతో కలసి సరాసరి గుంటూరు సెంట్ జోసెఫ్స్ కాన్వెంటుకు వెళ్లిరి. అచట రెవరెండ్ మదర్ ఏంజలీనా [మదర్ సుపీరియర్,] గవర్నర్ సతికి స్వాగతము తెల్పి, కాన్వెంట్ ప్రధానోపాధ్యాయిని సిస్టర్ స్టానిస్లాస్ ను, తదితర ఉపాధ్యాయినులను ఆమెకు పరిచయము చేసెను. గవర్నర్ సతి అంతట పతాకావిష్కరణోత్సవము జరిపెను. విద్యార్థినులు "ఝండా ఊంచా రహే హమారా" గీతమును గానము చేసిరి. తదుపరి విద్యార్థినులచే నృత్యగీత ప్రదర్శనములు గావింపబడెను. కాన్వెంట్ వారు మహారాణిగారికి ఒక సన్మానపత్రమును సమర్పించిరి. కాన్వెంట్ ఆవరణ అయిదు ఎకరములు మాత్రమేననియు, ఆ కొద్ది ఆవరణలోనే ఒక ఆసుపత్రి, ప్రసూతి చికిత్సాలయము, శిశు చికిత్సాలయము, నర్సుల శిక్షణశాల, మంత్రసానుల శిక్షణాలయము, చేతిపనుల శిక్షణాలయము, హైస్కూలు, బి. ఇడి. కాలేజి, ఉండుటవలన చాలా ఇరుకుగా నున్నదనియు, సమీపములో నున్న స్థలము కేటాయించవలెననియు, ఈ విషయమై ఇంతకుముందు అనేక పర్యాయములు మంత్రులకు, కలెక్టరుకు విన్నవించుటయైనదనియు, సన్మానపత్రములో తెల్పిరి. ఒక విద్యార్థిని మహారాణిగారికి సంస్థ తరఫున వందనములు సమర్పించెను. విద్యార్థినులు 'జనగణమన' పాడిన తదుపరి కార్యక్రమం ముగిసెను. అనంతరం గవర్నరు సతికి కాన్వెంట్ అంతయూ చూపబడెను. ఇంతటితో ఉదయపు కార్యక్రమం ముగిసెను. స్వ. వి.

## ఏలూరు పర్యటన

ఏలూరు, డిసెంబరు 12: ఆంధ్రదేశానికి వచ్చిన ఈ కష్టసమయంలో స్త్రీలందరూ ముందుకువచ్చి, తుపానువలన బాధితులైనవారికి అన్నివిధాల సహాయపడాలని, నేటి మధ్యాహ్నం, ప్రభుత్వ సెకండరీ-ట్రెయినింగు పాఠశాలలో జరిగిన మహిళాసభలో, మద్రాసు గవర్నరుగారి సతీమణి భావనగర్ మహారాణీగారు ప్రసంగిస్తూ అన్నారు.

ఉదయం మహారాణీగారు, అసిస్టెంటు కలెక్టరు ఎం. బాలసుబ్రహ్మణ్యంగారు వెంటరా జిల్లా ఆస్పత్రి సందర్శించారు. ఆస్పత్రివద్ద జిల్లా వైద్యశాఖాధికారి ఆర్. ఎన్. కేశవరాజ్ గారు స్వాగతమిచ్చారు. డా॥ హిల్డీ సతీమణి మహారాణిని పుష్పమాలాలంకృతురాలను చేశారు. తరువాత కేశవరాజ్ గారు తమ సహాయులైన డాక్టర్లను మహారాణీకి పరిచయం చేసి, అటుపిమ్మట ఆస్పత్రి వివిధ వార్డులను చూపించారు.

తర్వాత మహారాణి పురపాలకసంఘం వారిచే నిర్వహింపబడుచున్న శిశుసంరక్షణాలయాన్ని సందర్శించారు.

మధ్యాహ్నం మహారాణి పశ్చిమగోదావరిజిల్లా మహిళా బాలికాసదన గృహాన్ని సందర్శించారు. వసతిగృహ గౌరవ కార్యదర్శి నందూరి రామకృష్ణరావుగారు స్వాగత పత్రం చదివి సమర్పించారు.

సాయంకాలం మహారాణి, ప్రభుత్వ సెకండరీ ట్రెయినింగ్ పాఠశాలను సందర్శించారు. అచట జరిగిన సభకు స్త్రీలు చాలామంది హాజరయ్యారు. పాఠశాల ప్రధానోపాధ్యాయిని శ్రీమతి ఎస్. సీతారామమ్మగారు, శ్రీమతి వి. ఎస్. విజయలక్ష్మమ్మ, (గిల్డు ఆఫ్ సర్వీస్ కార్యదర్శిని) శ్రీమతి చుండూరు రత్నమ్మ (మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు) గార్లు మహారాణికి పరిచయం చేశారు. పైవారేకాక తమతమ సంస్థల తరఫున నివేదికలను స్వాగత పత్రములను చదివి మహారాణికి సమర్పించారు. తరవాత మహారాణీ శ్రీ రత్నమ్మ గారిచే ఏర్పాటు చేయబడిన స్త్రీల గృహపరిశ్రమల ప్రదర్శనాని ప్రారంభోత్సవం జరిపారు.

స్వాగతపత్రాలకు సమాధాన మిస్తూ మహారాణిగారు ఏలూరునందలి వివిధ సాంఘిక సేవాసంస్థలు కొనసాగించుచున్న కార్యక్రమములు ప్రశంసాపాత్రములుగా యున్నవనిరి.

అనంతరము పాఠశాల బాలికలు కొన్ని నృత్య, గీత ప్రదర్శనములను జరిపిరి. తరవాత మహారాణికి అల్పాహారవిందొసంగబడెను. స్వ. వి.